# భారవి



కృతిస్వామి,
రాజపుర సంస్థానాధీశ్వరులు, జమీందారులు
శ్రీ శ్రీ శ్రీ కాళ్లూరు రామకిషన్‌రావు మహాశయులు.



గ్రంథకర్త:
జి. జోసఫు కవి
చంద్రహాస, కన్నీటి కబురు, భక్తవిజయాది గ్రంథకర్త.
వినుకొండ.

# దైవస్తుతి



ఉ॥ నిన్ను భజింప నాకడ క

నీసము దమ్మిడి సొమ్ము లేదు నా

పన్న శరణ్యా! నా నొసట

పద్దెము లల్లెడి రేఖదప్ప "సం

పన్నుఁడ వాఁడు" వంచనెడి

వ్రాఁతల నెందుకో వ్రాయకుంటి; నా

కున్నదియే సమర్పణము

నొప్పుగఁ జేసెదఁ గొమ్ము రక్షకా!



# ANDHRA UNIVERSITY.

*Vice-Chancellor*:

**C. R. REDDY.**

**WALTAIR.**

*Dated, 26 Nov. 40.*

My dear Sir,

Many thanks for sending me your Mss. for opinion.

I must congratulate you on your work, which is an excellent one and in many respects an interesting contribution to Telugu Literature. The fact that a member of the Depressed Classes has attained such scholarship and power of language is evidence of the potential excellence of those communities and is a sad and serious reflection on the loss sustained by the inhuman treatment, social, spiritual, cultural and political. to which they were subjected through ages. I am much impressed by your fine racy style. I wish your BHARAVI every success.

*Yours Sincerely,*

**C. R. REDDY.**

# పీఠిక

ఈ కాలము పై మెఱుఁగులకు లోభము కలది. లోఁతైన భావాలకు పారాగతము లేదు. అందులో జాతీయ భావములు నిరాదరణ హేతువులు. ఆంగ్లేయ భాషాగ్రంథములలో నున్న భావములుగాని, వానికి దగ్గర భావములుగాని, అక్షిభాసస్ఫూర్తి గలిగించు కావ్యరచనగాని నేఁడు ముఖ్యాదరపాత్రమగుచున్నది. పలుచని భావము తీర్చు శబ్దము మృదువుగా సుఖముగా నుండును. లోతైన భావము తీర్చు శబ్దము నిగ్గుతేరి భాషలోని శక్తిని వెల్లడించి పరిచయార్థికావ్యవస్థయందు సుఖమును కన్న నొక్క మెట్టు పైదానిని, ఆనందమును, సమకూర్చును. సామాన్యులు సుఖలోలురు. అంతకంటె పైతరగతివారు ఆనంద జిజ్ఞాసువులు. ఈ యిరుతెగల వారికి నిరుతెగల కావ్యములు రుచించును. శబ్దాడంబరము లేని కావ్య ముండదు. మొదటితరగతి కావ్యము శబ్దాడంబరముతోఁ గూడియు లేదనిపించును. ఆ యనిపించుట జిగియు, ప్రౌఢియు లేకుండుట. రెండవతరగతి కావ్యమునందు జిగియు, ప్రౌఢియు వ్యవధాభూతములై యుచ్చముగా శబ్దాడంబరము లే యనిపించును.

పాఠకులలోఁగూడ ముప్వేషములు. ఒకరు జాతీయములైన పూర్వకావ్యములు చదివి భాషాభావముల యొక్క పరస్పర సంబంధ మచ్చట నుండి తెచ్చుకొని రసజ్ఞతానిష్ణాతులైనవారు. రెండవవారు పరభాషాగ్రంథపఠనమువలనఁ గలిగిన చిత్రసంస్కారము, దేశభాషయందలి సామాన్యజ్ఞానము కలిగి దేశభాషాప్రౌఢి వదలిన భావముల కెక్కువ వెలకట్టు

వారు. మూడవవారిని గుఱించి చెప్పనక్కఱ లేదు. పై నిజెప్పిన రెండురకముల కావ్యములలోను, మొదటిది రెండవరకము వారికి, రెండవది మొదటిరకమువారికి నాహ్లాద జనకము లగును.

ఈ జోస్యకవి వ్రాసిన 'భారవి' యను చిన్నికావ్య మా రెండవతరగతికావ్యము. భారవికథ మిక్కిలి ప్రచారములో నున్నది. గరిమెనుమగు కామయ్యగారు, భావనగిరి విజయ రామయ్యగారు మఱియు నెవ్వరో యీ కథను కృతిచేసిరట. నేనుచూడ లేదు. కామయ్యగారి పుస్తకము శేషు పాఠముకూడఁ జెప్ప వలయును. ఇంతలో నీ కవి యీ గ్రంథమును దెచ్చి పీఠిక వ్రాసి పెట్టుఁడని యడిగెను. చదివితిని గదా! కావ్యము దివ్యముగా నున్నది. చక్కని ధారాశుద్ధి, మంచిభాషాజ్ఞానము, పలసినచోట్ల ప్రౌఢమై, మృదువైనచోట్ల సుకుమారమై, తెలుఁ గులుకూర్పుట కాని, సంస్కృతములు గుంఫించుటగాని యెచ్చోట నదియుచితమై ఈకావ్యము రసవత్తరముగా నున్నది. అందందు శబ్దదోషములు కొన్ని యున్నవి. వాని లెక్కయేమి? అర్థ రాహిత్రి, భావమస్థులు, ఛనుగతి మొదలైన రెండు మూడు దోషములతోఁ బనిలేదు. శబ్దగత దోషములు తెలిసికొనినచో సర్దుకొనవచ్చును. రసవంతమైన రచన పూర్వజన్మము నుండి తెచ్చుకొన వలయును.

ఈ కవికిఁ దన కులస్థుఁడును సుప్రసిద్ధుఁడు నైన జాషువాకవి యందభిమానము కలదు. అది యభిమానమ మాత్రమే. "మబ్బు గుత్తాలపై నబ్బురంబుగ స్వాధి

పండితుఁడై యపండితునివలె నసనె ననుట—భారతదేశ నాగరికతా పద్ధతులు తెలిసిన పలుకుబడి.

తుదకుఁ దన తప్పు తెలిసికొని భారవి తండ్రి పాదములపైఁ బడెను. తండ్రి 'నేటికైన శాస్త్రజన్య పరిజ్ఞాన సరణి మను' మని దీవించెను. భారవికి శాస్త్రపరిజ్ఞాన మదివఱకే కలదు. అది పట్టి చదవు. ఇప్పుడు కావలసినది శాస్త్రజన్య పరిజ్ఞానము.

ప్రాతఃకాలమును వర్ణించుచున్నాఁడు. "కర్షక వసతి రోఁకళ్ళ చప్పుడు సాగె సన్నమ్ముగ కావించు నట్టిపనికి." ఈ వర్ణన వినుకొండలోనిది. భారవి నాఁటిది కూడను.

రెండవ యాశ్వాసమునందలి ౭వ పద్య మితని ప్రౌఢమైన రచనకుఁ దార్కాణము. ౮, ౯ పద్యములలో ఫిరదౌసిలోని జాషువాగారి రచనము పోలికగా రెండు పద్యము లున్నవి.

భారవి తన మామగారి యింటికిఁ బోవుచున్నాఁడు. 'పడమటి జవ్వనిక్ నిశిత భానుఁడు ప్రేమమునఁ జేరబోయె'నన్న వర్ణన యెంత యనుకూలముగా నున్నదో చూడుడు. ఇందలి ౧౭, ౧౮ పద్యములు తెలుఁగు మాటల కూర్పునకు నికషాయమానములుగా నున్నవి.

అత్తవారి యింటి యల్లుని యునికి కష్టమగుట,

'ఘనుఁడా నల్లుని కింక లాతులు కేటుల్ కావచ్చు నత్తింటిలో'. ఇది 'పెంచిన ఋషులకే యిట్లున్నది, కడుపారఁగన్న తలిదండ్రుల కెట్లుండునో' యన్న కాళిదాసోక్తి యంత

విశితముగా నున్నది. తండ్రి దేవునకు మించు దేవుఁడట.

సుకవులకుఁ గష్టము లంటునట,

'అర్కబింబమ్మునకుఁ దమ మంటి నంట్లట. భారవి పతని యత్తగా రీసడించుచు

'కూఁతునెత్తిపై మూఁకుఁడు నగ్గి ఖండములు పోసినతప్పు' తన యందున్నదనెను. ఈ పలుకుబడులు మహాకవివి. భారవి తన్నెందరు తిట్టిన నూరకొనును.

'కూరిమి భార్య యపూర్వ బంధఘుంబొందిక వెళ్ళిపోమ్ము నక పోదమటన్న.'

తండ్రి శాపఘుగతి తలఁపునకు వచ్చునఁట. భార్య యొక్క యపూర్వ బంధపుఁబొందిక వెళ్ళిపొమ్మన్నదనుట మహార్థ మిమిడించుకొను రమ్యమైన కూర్పు. కిరాతార్జునీయ కావ్య వ్యాఖ్యానము ముప్పదియేడవ పద్యమునఁ జేసెను. అందులో 'రాజకీయపునీతుల మెట్లుతో' కావ్యము నిర్మించెననుట భారవి కావ్యమును లెస్సగాఁ దెలియుట.

భారవి యత్తవారింట సేవకుఁడైనాఁడు. "నిదుర మంచాన కొంగును విదలుచుకొని పొలముపోవును.'' ఇందలి సొగసు పల్లెటూరి కాపులకే తెలియవలయును. ౭౦, ౭౧ వ పద్యములలోఁ గవిత్వమున కెంత విశ్రాంతి కావలయునో, విశ్రాంతిలేని కవి యెంత యిబ్బందిపడునో మిక్కిలి చక్కగా వర్ణితము లయ్యెను.

ఈ కావ్యమునకు చూడామణీభూతమైన యొక పద్యమున్నది. రెండవ యాశ్వాసములోని ౪౪ వ పద్యము. భారవి భార్య భారవి నోదార్చునంట. కన్నీటి సెలయేటి లంకలలో భర్తకాశ్రయవేదులు కూర్చును. తన పాతివ్రత్యమను మణిసౌధములో భక్తి పీటలువేయును. దుఃఖపుటడవిలో నోదార్పు పుష్పాళ్ళ తిన్నెలు కూర్చును. ఇంతచేసి తానతని కడుపులోఁ దలదూర్చి యేడ్చును.

ఇంతలో 'శ్రావణ భార్గవవారంబులు వచ్చె యువతి వర్గము నోమఁగ.'

'కని చుట్టంబులు సేయు భీషణపు హుంకారధ్వనుల్ శేగనో యనఁ గర్జించెను మేఘజాల మురనై'. ఈ పద్యమంతేయు నిట్లేయున్నది. కథావస్తువునకుఁ బ్రాస్తావికమైన వర్ణనకు నిట్లభిన్నాఖ్యవసాయము చేయుట వర్ణనముయొక్క యవధి చేకూర్చుట. ఇందలి ౫౧ వ పద్యము ౫౬, ౫౭ పద్యము లీ కవియొక్క లోకజ్ఞత్వమును వెల్లడించుచున్నవి. ౫౬ వ పద్యము ధారాశుద్ధి కుదాహరణముగాఁ జెప్పవచ్చును. శాపకాలము తీరిపోయి భారవి తనయూరికి 'ఉద్దీపితచిత్తుఁడై చనె, సతీయుతుఁడై ప్రతిభాసమేతుఁడై' ప్రతిభాసమేతుఁడై యను మాట సంవత్సరముదాగిన తన ప్రతిభ మఱల ప్రాప్తించిన దని చెప్పుచు నాశ్వాసాంత పద్యమునందలి చివరి మాటయై యర్థమును గొల్లగొట్టుచున్నది.

ఇట్లీ గ్రంథమునందలి రమ్యతలు గ్రంథాంతమువఱకుఁ జూపింప వచ్చును. అట్లు చేయుట తెలిసిన పాఠకునకు ప్రథమా

సందేహము లేకుండఁ జేయుట. ఇంకొక్క విషయమే వ్రాసి యుపసంహరింతును. నర్తకుఁడు ప్రయాణము చేయుచున్న పడవ మునిగిపోయెను. అప్పుడు

జలధిం గూలిన సర్వపాంథజనయోషాకింత సంలగ్నమం
గళసూత్రింబుల కాంతి లోకమునకుం గప్పెన్ విషాదంపు దు
ష్టుల నేపథ్యము, మృత్యుదేవి ప్రతిథన్ బొంగారి విప్వాగ్ని భీ
తిలఁ గ్రూరంబగు హాస్యములం బజూపి యుత్సేకించె నొక్కుమ్మడిన్.'

ఈ పద్యమునందలి శోక రసాధిదేవతా ప్రస్ఫురణమును జూడుడు. ఈయన 'శవ్యగ్రయాయి,' 'ఆదరణాధిక బుద్ధి,' పరిష్కరించుఁడు, 'శ్రీమ సముద్రభంగములకు భంగమ్ము ఘటిల్లె' మొదలైన సంస్కృతము నందలి సొగసైన పలుకుబడులకుఁ దోడు, 'మూడకు మూడ యొత్తుగల మాటలతో' 'నిమ్మళము' 'చిందిలిపాటు' 'తాకట్టుగఁ బెట్టుకొన్న తెమువరి' 'తోంటి మొప్పందము చేసి' మొదలైన తెలుగు పలుకుబళ్లు గూడ నీయన భావుకత్వమును సూచించుచుఁ గావ్యము చిన్నదయ్యు నుత్తమశ్రేణికిఁ వచ్చుచున్నది. ఈ కావ్యము చదివి నేను చాల నానందించితిని. జాషువాగారి పిరదౌసి చదివినప్పటి కన్న నెక్కువ యానంద మనుభవించితిని. ఈ కవికి నే నేమి యీయఁగలను? నేను మహారాజును గాను. రాజును గాను. ధనవంతుఁడను గాను. ఒక దోపతులచాపు మాత్రము పెట్టి పీఠిక వ్రాసి యిచ్చుచున్నాను. కాని శ్రీ కాళ్యాప రామకృష్ణారావుగారు నేను కాని జమీన్దారులు గాన ఈ గ్రంథము

కృతి పుచ్చుకొని యీ కవిని సన్మానింపఁ దగినారు. రసజ్ఞుఁడు ధనికుఁడైనచో, కానిచో, నున్న భేదమిది. ఈ కృతికర్తకుఁ గృతిభర్తకు పరమేశ్వరుడు దీర్ఘాయువు నైశ్వర్యము నితోధికసాహిత్యసేవయు సమకూర్చుగాత మని యాశీర్వదించు చున్నాను.

బెజవాడ,
౨౮-౪-౪౧.

విశ్వనాథ సత్యనారాయణ.

# విజ్ఞప్తి

పాఠక మహాశయులకు !

సుప్రసిద్ధుండగు భారవి మహాకవి జీవిత చారిత్రంబును నేను 1931 సంవత్సరమే రచియించితిని. కాని నానాఁటికి దేశ కాల పరిస్థితులు మాఱుటం బట్టి, మానవుల బుద్ధీంద్రియ పాటవంబు లంత కంతకు సన్నగిల్లి, రాజకీయాందోళనా శృంఖల పరంపరలచేఁ గట్టుబడి తృప్తి సనక కృత్రిమ సౌందర్యావలోకన మోహ పారవశ్యులై ప్రాచీన సంప్రదాయంబులఁ గేవలము విసర్జించిరి.

అక్కారణంబున నా యనాథ కవితా కుమారికకు శరణం బొసంగు తగిన నరుండు లభింపమికి, యింతకాలం బెట్టులో కాలముఁ గడుపవలసివచ్చె. అంతఁ గొండొకనాఁడు నా శిష్యుండగు శ్రీయుత ఎడ్లపల్లి సాముయేలు కవి నన్ను దర్శించి గ్రంథ విషయ మామూలాగ్రముగఁ బ్రశ్నించి "శ్రీ కాఖ్యారు వారి ధర్మ సంస్థాన విధానంబు నాతో విన్నవించి, మీ రవశ్యంబ శ్రీవారి సంస్థానము దర్శించిన మీ కోరిక లన్నియు కొనసాగ గల పని" నాతో సవినయముగ వచించె.

అంత సంతసించి నే నటకేఁగి, శ్రీవారిని మద్గ్రంథ మాధురీ మహిమార్ణవ వీచికా డోలికల నూగించితి. అంత సమందానందాతిశయంబునఁ దొప్పదోఁగి, కృతిని స్వీకరించి మాన్యంబును, పట్టుపీతాంబరంబుల బహూకరించి, నన్నానంద భరితాంతఃకరణునిగ నొనర్చిన రాజపూజితులును, వదాన్య శేఖరులు

కరుణాసమన్వితులు, సాక్షాత్స్వంభావ సరస్వతీ తేజోవిరాజమానులు, భాషా పోషకులు నగు శ్రీ శ్రీ శ్రీ కాళ్యాగు రామకిషన్ రాయ రాజేంద్రునికి, భ్రాతృ నాజ్ఞ జవదాటి మెలంగని పుణ్యమూర్తులు, సత్య సంపన్నులు నగు శ్రీ శ్రీ శ్రీ యుమామహేశ్వరరాయ మహీపాలునికి పరాత్పరుఁ డింతోఽధికైశ్వర్య సౌభాగ్యంబు లొసంగి నా చంద్రతారార్క స్థాయిగ వర్ధిల్లఁ జేయుఁగాత. అత్యంత ప్రేమరసంబును నాపైఁ గురియించి యనేకరీతుల సత్కరించి కాపాడుచున్న శ్రీ శ్రీ శ్రీ భట్టిప్రోలు సూర్యప్రకాశరావు పంతులుగారికి, శ్రీ చదలవాడ జంగమయ్య చౌదరిగారికి, శ్రీ జాస్తిరామకోటయ్య చౌదరిగారికి, శ్రీ నాదెండ్ల సుబ్బయ్యచౌదరిగారికి నే నెంతయో కృతజ్ఞుఁడను.

కవివరేణ్యులు బ్రహ్మశ్రీ విశ్వనాథ వేంకటేశ్వర శాస్త్రిగారికి నే నెంతో విధేయుఁడను.

ఈ నవీన యుగంబున నే నర్పించు మత్కవితాకుమారికను మన్నించి నన్నుఁ బ్రోత్సహింప విద్వత్కవులకు నమస్సులర్పించు,

వినుకొండ

బుధజన విధేయుఁడు.

జి. జోసప్పకవి.



కృతి స్వామి:

వదాన్యశేఖరులు, రాజపుర సంస్థానాధీశ్వరులు, జమీందారులు,

శ్రీ శ్రీ శ్రీ కాళ్లూరు రామకిషన్‌రావు మహాశయులు.

# కృత్యవతరణిక



గీ. కట్టమంచికులీనుఁడు కవివరుండు
బహుళ మేధావి విజ్ఞాన వార్ధి, యతి ద
యాళు, రామలింగారెడ్డి యతుల కర్త్రి
దలఁచి నుతియింతు వారి పాదాల కెఱఁగి.

గీ. పరగ విజ్ఞాన మధువులఁ బాఱజిమ్మి
తెలుఁగు కవికుమారుల నోట కలిపి పోసి
జగము నలరింపఁజేసిన సత్కవీంద్రు
ఘనులు తిరుపతి వేంకట కవులఁ గొల్తు.

గీ. ప్రీతి నుతియింతు కవిరాజు విశ్వనాథ
సత్యనారాయణాఖ్యు ప్రశస్త కవిత
నెఱిఁగి, యభినవ తిక్కన బిరుదువాని
గొల్తుఁ దాపి ధర్మారాయుఁ గోర్కెదీర.

సీ. వెల్లంకి సుబ్బయ విద్వద్వరేణ్యుని
పాదపద్మంబులఁ బ్రస్తుతించి
వేద స్వరూపుండు వెల్లంకి నారాయ
ణాఖ్యుని మదిని ధ్యానమ్మొనర్చి
రాయప్రోలు చిదంబరము శాస్త్రిని భజించి
జానకిరామయ శాస్త్రిఁ దలఁచి
గోపాల కృష్ణ సద్గురుని దలంచి మా
ర్కండేయ శర్మను గాంక్షఁ దలఁచి

గీ. క్షితిని గోరావఝుల రామకృష్ణకవిని
సత్యశాలి సీతారామశాస్త్రి కెఱఁగి
సరస జంధ్యాలకులజుండు సాంద్రయశుఁడు
నిశ్చలుండు సుబ్రహ్మణ్యుని భజియించి
సరగ మల్లాది వేంకటేశ్వరుని దలఁతు.

మ. గురువై పాలకుఁడై బుధుండయి ననుం
గుం బ్రాపణీయుండునై
గురువిద్వాంసుఁడునై కవీంద్రుఁడయి వా
కుంగాంతసూనుండునై
ధర నొప్పారు దయామయుండు నగు బం
దా సూర్యనారాయణున్
గరమొప్పన్ నుతియింతు బత్తిపువుకా
నుకల్ నిత్య మర్పించుచున్.

శా. క్ష్మ నుద్యత్కృపు లెన్న నాశుకవి స
మ్రాడంకముం గాంచి ప్ర
జ్ఞానిష్ణాతలునై వధానశత ము
త్సాహంబునం దీర్చి వి
ద్యానీరేజవిలోచనాకరుణ ని
త్యం బొప్పం గొప్పింపువార్
నా నెయ్యంపుగురుల్ భజించెద మహా
నందం బమందంబుగన్.

గీ. బాల్యమిత్రుండు నా సహపాఠకుండు
వాఙ్మయాభీష్టలోలుండు, పండితుండు
భావమఱదియు కంభముపాటి రంగ
రాట్కవిని గొల్తు పుష్పహారాలతోడ.

గీ. శబ్దశాస్త్రమ్ము ఛందమ్ము సరగఁ జెప్పి
బాగు నోగుల సవరించి బాల్యమందు
నలరు నీతుల నేర్పించినట్టి నాదు
చిన్నిపిత యబ్రహామును సన్నుతింతు.

గీ. ఆంధ్ర క్రైస్తవ జగమునం దాదియందు
నవ్యకవితంపు సింహాసనంబు నెక్కి
పాలనముఁ జేసి ఫున్నెంబుఁ జాలగొన్న
బీరినిడి మోషె సత్కవిఁ గోరి దలఁతు.

కావ్యపఠనంపు టాసక్తిఁ గలుఁగఁ జేసి
యూహాపోహాల జ్ఞానంపుటుగ్గు కొంత
చిఱుతప్రాయానఁ బోసిన శ్రేష్ఠుఁడైన
జాషువ కవీంద్రుని మదిని సన్నుతింతు.



# కృతిస్వామి వంశ ప్రశంస



శా. శ్రీరాజిల్లఁగ నాంధ్రదేశమున సి
స్సీమ ప్రభావాఢ్యుఁడై
భూరిఖ్యాతి విరాజమానుఁడయి స
మ్మోద ప్రధానుండునై
కారుణ్యాంబుధి యంచనంబరఁగు శ్రీ
కాళ్ళూరు వంశోద్భవుల్
శ్రీరాముం డొగి నోముత న్నిరులతో
శ్రీరామకృష్ణప్రభుల్. 1

మ. భువి నాత్రేయసగోత్రపావనుఁడు సం
ఫుల్లేద్ధ కాళ్ళూరు వం
శ్యవతంసుండు వదాన్య పూజ్యుఁడు యశ
స్సాంద్రుం డమాత్యుండు వీ
రవరేణ్యుండు కవీంద్ర పోషకుఁడునై
లక్ష్మీశ దేశాయి సం
భవ మొందెన్ సరివారలౌ దొరలు వ
హ్వా నాఁగ రాజాదృతిన్. 2

ఉ. సత్యవచఃప్రధానుఁడు వి
శాలగుణాకరుఁ డా నృపాలుఁ డా
దిత్య సమాన తేజులను
దివ్యగుణోన్నతులైన పాపయా

మాత్య వదాన్య శేఖరుని,
మానిత వాక్ప్రయశాలి యప్పయా
మాత్యుని, వేంకటప్పయ య
మాత్యునిఁ, గాంచెఁ ద్రిమూర్తులంబలెన్.

సీ. ఆ నేత గర్భాన నానందనిధి 'జోగ
రాయ దీక్షిత' మహాప్రభువరుండు
సరసుఁడు 'శ్రీరామచంద్ర రాడ్విభుఁడు' 'దే
శపతి' 'సీతారామ' సాంద్రయశులు
'లక్ష్మీన్నృసింహుండు' లాలిత భాగ్యోన్న
తుఁడగు 'రంగారావు' పుడమిఱేఁడు
ధీరుండు రసికుండు దేవేంద్రసముఁడు 'వేం
కటరావు నృపుఁడు' నిష్కల్మషుండు
'శేషగిరిరాయ భూజాని' చెలఁగి యష్ట
దిగ్గజంబులో యన పుట్టి దిక్కు లాక్ర
మించి జయపతాకాల నాటించి పృథుల
కీర్తిఁ గాంచిరి విభులు దిగ్దేశములను. 4

సీ. వ్రాయించెఁ దనకీర్తివనిత తోషింప ది
గ్దంతి దంతాలపైఁ దనచరిత్ర
ప్రకటించెఁ దన భుజాపటిమ యద్భుతముగా
వైరుల గుండియల్ పగిలిపోవ
నాటించె నెత్తైన కోటకొమ్మల మీఁద
సమదశాత్రవ శిరస్సంచయంబు

శాసించెఁ దన శౌర్యసాహసంబులు సర్వ
జయలక్ష్మి హర్ష బాష్పములు రాల్ప
కలితఁగొనఁ జేసె వార్ధిమేఖల ఖలారి
కాండముల నుగ్గునూచంబు గాఁగఁ జెలఁగి
రాజధర్మ ప్రకాశికా గ్రంథకర్త
దివ్యగుణుఁడు 'జోగారాయ దీక్షితుండు'. 5

మ. గతజన్మంబు తపస్సు పండెనన జో
గారాయ గర్భాన పూ
జిత 'రాజేశ్వర రామకృష్ణవిభులున్'
శ్రీమించు 'గోపాల భూ
పతియు'న్బుట్టి విశాలరాజ్యమును సం
పాదించి స్థాపించి కీ
ర్తినిం గాంచిరి దిక్కులం దమిత దో
ర్వీర్యం బవార్యంబుగాన్ . 6

సీ. ఎదురాడు శాత్రవ మద మడంపఁగఁ జాలు
శక్తి సంపత్తి విశారదుండు
అర్థార్థిజనుల దీనాలాప మాలించి
కాపాడ యత్నించు ఘనయశుండు
దిక్తటంబుల గెల్చి తీండ్రించి విజయ రం
భల పెండ్లి యాడిన మహిత యశుఁడు
బహుళకష్టంబులు పైకొన్న లేదని
పలుకని ధర్మ విభాసితుండు

సత్య వాక్యంబునఁ హరిశ్చంద్రనృపతి
ధర్మగుణమును విడువని ధర్మరాజు
పరమభక్తుండు కవిరాజు పండితజన
మండితుండు రాజేశ్వర మనుజవిభుఁడు. 7

గీ. అమ్మహాత్ముఁడు 'జోగరాయాగ్రగణ్య
రామచంద్ర సీతారామరాయ విజయ
చంద్రరావు'లనియెడి పవిత్ర పుత్త్ర
వరులఁ గాంచెను జగముపై భాసిలంగ. 8

తే. జోగరాణ్ణృపు సోదరస్తోమ మందు
సప్తసంఖ్యను వెలుగొందు శౌర్యరాశి
దత్తుగాఁగొనె జోగరాట్తనయు లందు
శ్రేష్ఠుఁడగు రామకృష్ణుని చెన్నుమీఱ. 9

ఉ. శ్రీలకు నాలవాలమని
చెన్నలరారెడి కొండపల్లి వం
శాలయ రత్నదీపపు య
శంబు గడించియు, హేమచంద్ర భూ
పాలుని, సత్యవాక్య పరి
పాలితు వేంకటరాముఁ గాంచి గో
పాలధరాధినాథుఁ డిల
భాసిలె స్వీకృతి వంశమొప్పఁగన్. 10

క. శ్రీరామచంద్రునకు న
ప్పారాయం డఖిల సుకవి వంద్యుఁడు, కరుణో
దారుఁడు మురళీధరుఁడుఁ
ధారిణి జన్మించి యశము దాలిచి రెంతఁ. 11

సీ. ఆశ్రయించినవారి నండఁ జేర్చుటెగాని
పల్లెత్తి పొమ్మని పలుకఁ డెపుడు
శరణన్న వారలఁ గరుణించుటెగాని
పరుషంపు టుక్తులఁ బలుకఁ డెపుడు
బీదసాదులఁ జూచి ప్రేమించుటెగాని
చండాలుఁ డని నెట్టియుండఁ డెపుడు
కావు కా వను వారిఁ గడకుఁ జేర్చుటెగాని
కోపాన సాధింప గోరఁ డెపుడు
గీ॥ కవి జనంబుల మిక్కిలి గారవమున
రక్షణము సేయు చుండును, రామచంద్ర
పుత్త్రిరత్నంబు తోడుతఁ బుడమియందు
రాజిలుచునుండు శ్రీయప్పరాడ్విభుండు. 12

గీ. పండితాదరణంబు స్వాభావికంబు
యాచకులఁబ్రోచు దీక్ష నిత్యవ్రతంబు
సాధు సజ్జన సహవాస సౌఖ్యవాంఛ
ఔర ! శ్రీ మురళీధర వీరమణికి. 13

మ. జలధీశానుఁడు చంద్రుఁ గైవడిని నం
చత్ప్రీతిసంభూత మో
దలసద్భంగచయాల పొంగుచును సీ
తారామ చంద్రాగ్ర భూ
తలనాథోత్తముఁ గాంచి వాసిఁ గొనె సీ
తారామ భూపుం డిలన్
దలమే? వర్ణన సేయ కీర్తి మహిమల్
ధాత్రీస్థలం బంతటన్. 14

సీ. ఆశావధూటిని నలరించి కీరితి
పుష్టిఁ గట్టిన మూల పూరుషుండు
ధర్మదేవత పేరు ధాత్రిలోఁ జాటించి
మును వ్యాప్తిఁ జేసిన పూజితుండు
కవితాకుమారిని గని ముద్దు లొలుకంగఁ
బోషించిన యభినవ భోజరాజు
నిరుపేద జనులపైఁ గరుణారసామృత
హోరిదినిఁ బాఱించి నట్టి ఘనుఁడు
ఆంధ్ర గీర్వాణ హూణవిద్యావరుం డ
టంచు దిశలందు భూరివిఖ్యాతి నొంది
మూఁడుపొద్దులు పండితుల్ ముదము నొంద
ప్రతిభఁ గాంచెను వేంకటరాయ విభుఁడు. 15

గీ. ప్రథిత మతి యైన వేంకటరాయనృపతి
రామకృష్ణ నరేశ్వరు ప్రేమ దత్తు

గొన్న మీదటఁ బుట్టె నకుంఠయశుఁ డు
మామహేశ్వర విభుఁడు సుత్రామ భోగి. 16

మ. అనురాగంబును సత్కవీంద్రతతియం
దాసక్తి, దాతృత్వమం
దున ప్రావీణ్యము దైవభక్తి పరతన్
దోర్వీర్యమున్ గల్గి వా
సిని జేకూర్చిరి రామలక్ష్మణు లనన్
శ్రీరామ కృష్ణాఖ్యుఁడున్
వినతుండైన యుమామహేశుఁ డెపుడున్
విస్తార సఖ్యంబునన్. 17

సీ. తన దానమహిమను విని స్వర్గలోకాన
కర్ణుని హృదయంబు కలఁత బాఱె
తన యశఃకాంతను గని బిడౌజుండు స్వా
గత మిడె నెదురేఁగి కౌఁగిలించి
తన ధర్మశీలత విని నాగరాణ్మణి
గురియించె పూవుల క్రొత్తవాన
తన శౌర్యపటిమను విని దేవసభలోన
భీష్ముఁ డాశ్చర్య సంవృతుఁడు నయ్యె

గీ. తన ప్రశస్త ప్రసన్న వాక్తండ మరసి
సాంద్రఘనసార నీహారచంద్రసార
మెల్ల నొలుకంగ నొకమారు ఫుల్లవదనుఁ
డగుచుఁ జెలువొందు తన యమాత్యకుల మెన్న
ధరణి శ్రీ మదుమామహేశ్వరవిభుండు. 18

---

# కృతిస్వామిప్రశంస



గీ. అనఘుఁ డైన యుమామహేశాఖ్యనృపతి
కన్నయై మత్కృతీశుఁ డైనట్టి రామ
కిషనురావు నృపాలు కిల్బిషవిదూరు
గూర్చి యొక్కింత నిచట వాక్రుత్తు భక్తి. 19

సీ. దారిద్ర్య జనుల కే ధన్యాత్ము నాదర
ణీయపుం జూపు పెన్నిధులరాశి
ఆర్తజనాళి కే యర్థవంతుని దివ్య
దర్శనప్రాప్తి రత్నాలమూట
కార్యార్థి జనుల కే ఘనుని వాక్కులు సదా
సమసిపోవని శిలాశాసనములు
ఆంధ్రదేశాని కే యమలాత్ము పేరివి
కరుణా సమన్విత కల్పవల్లి
గీ. ఏ మహాత్ముని కీర్తి కవీంద్రు లెల్ల
నిముస నిముసంబు కావ్యగర్భముల వ్రాసి
తలఁచుచుందురు నట్టి శ్రీధర్మమూర్తి
రామకృష్ణుని నెన్నతరంబె ? జగతి. 20

సీ. వాసించె నెవ్వాని వాసి సంపఁగి తావి
మిన్నేటి క్రొందమ్మి మేడలందు
వ్యాపించె నెవ్వాని వరదాన జలము భా
గీరథీతటినిలోఁ జేరుదాక

ప్రవహించె నెవ్వాని పరమశాంతిరసంబు
శిబి మహాత్యాగ ప్రసిద్ధభూమి
దర్శించె నెవ్వాని ధర్మవాణి కవుల
కావ్యాల కన్నె చక్కందనంబు

గీ. దశదిశావలయంబు విస్తార కీర్తి
యలమి యెవ్వాని స్తుతియించి దలఁచుచుండు
రట్టి శ్రీరామకిషను ధర్మాగ్రగణ్యు
మహిమ వర్ణింపఁ బూనని మనుజుఁ డున్నె ? 21

చ. తపముల నేమి జేసిరో ? వి
ధాతను గూరిచి ప్రాగ్భవాన రా
జ పురము రాజ్య లక్ష్మియు, ప్ర
శస్తయనం దగు కావ్యకన్యయున్
విపుల యశుండు ధీచర ద
భీష్ట ధురంధరు రామ కృష్ణ భూ
మిపతిని భర్తగాఁ గొనఁగ!
మేదిని శాశ్వతమై వెలుంగఁగన్. 22

సీ. పూర్వోత్తర రసాంబుపూరవాహినుల ప్ర
క్కవిడిది సౌధంబు కాంతితోడ
బ్రహ్మతేజం బుట్టిపడు మోమున సమాత్మ
సంస్థిత మందహాసంబుతోడ

అరుల గుండెలు వ్రీలి యుదరంగ చాల ప
సందైన కోర మీసాలతోడ
కవి పండితుల ప్రేమఁ గాపాడ దీక్షచేఁ
గట్టిన దాన కంకణముతోడ

గీ. నూత్న నిర్మిత శోభచే నుసుముచున్న
రాజపురపాలకుం డైన రామకృష్ణ
రావు విలసిల్లు నిద్ధరారాజ్య మెల్ల
ఒకడె పాలింపగా జాలు నుక్కువుండు. 23

ఉ. యాచకు లెంద ఱేని యుద
యాస్తమయాంతము తెంపు లేకయున్
యాచన చేసినన్ విసిగి
యాగ్రహ మొందక చిత్తగించు లే
తోచినబుద్ధి, లేదనెడి
తొందఱమాటలు రావు నోట తా
నోచిన నోములెట్టివో? క
నుంగొనఁ దొల్లిటి జన్మ మందిలన్. 24

గీ. కాననంబుల కరుదెంచి కష్టమనక
ఓషధులఁ దెచ్చి నూరించి కాసుసొమ్ము
ముట్టకను ధర్మవైద్యంబు ముదముఁ జేసి
ఘనతనొందెను సరి భిషగ్వరులు మెచ్చ. 25

చ. ఇడుములు తెప్పలై బరువు
లెత్తి కలంతను బెట్టుచుండినం
గడఁగి హితాళికెల్ల నుప
కారమొసర్చుట కాలసింపఁ డె
ప్పుడును, విశాలసద్గుణ వి
భూతి పరంపర జన్మతోడ నే
ర్పడియెను రామకృష్ణునకు
వల్లనఁ బోవవి జీవితంబునన్. 26

సీ. కుండలీంద్రుని కృతిఁగొని తన్విఁదీర హ
ర్షించినట్టి మనుమసిద్ధుఁ డేమొ?
కాళిదాసుని ముద్దుకవితాకుమారిని
రాజిలఁ జేసిన భోజుఁ డేమొ ?
పెద్దనార్యుని మంచి ముద్దు పోకడల నా
రసి మురిసిన దేవరాయ లేమొ ?
భట్టుమూర్తికలంబు గుట్టు నెఱింగిన
రసికుండు తిరుమల రాయ లేమొ ?

గీ. పూర్వజన్మాల; కానిచోఁ బూజ్యకవుల
కావ్యకన్యల భావంపు గతుల నెఱిఁగి
సత్కరించెడి విధ మెట్లు సంభవించు
రామకృష్ణసమాహ్వాయ రాజమణికి. 27

గీ. జనక మార్గావలంబివై సత్కవీంద్రు
వరుల దీవన గడియించి ప్రబల కీర్తిఁ
గాంచి, యాయురారోగ్య భాగ్యాలఁ బడసి
వరలుమయ్య రాజేశ భూపాలబాల. 28

సీ. అల త్రిమూర్తులకు నుయ్యాలఁ గల్పించి జో
యని పాడు ననసూయ కక్క యేమొ?
పతిభక్తి యువతి సంతతి కుగ్గు పోసిన
సీతామహాదేవి చెల్లెలేమొ?
పతిమేన మనము దాపటి సగంబని పల్కు
గిరిపుత్రికకు ముద్దుమఱఁది లేమొ?
మాంగల్య శోభసుమాస్త్ర కార్యసాధనం
బను రతికిఁ నేస్తురాల యేమొ?

గీ. అనఁగ ధరనొప్పి త్యాగభాగ్యంబు స్థైర్య
సంపద విశాల దాతృత్వ సహన భక్తి
గలిఁగి రామకిషను పత్నిగాగ వెలసె?
నమలగుణశీల శ్రీకమలాంబ దేవి. 29

సీ. ఎందాక హరిణాంకుఁ డినుఁడు నక్షత్రాదు
లాకాశవీధిఁ జెన్నారుచుండు
ఎందాక మాధవుం డిందిరాశ్లేష సౌ
ఖ్యానంద కలశాబ్ధిఁ గ్రాలుచుండు

ఎందాక ధాత సహిష్ణువునై పల్కు
సతితోడ మురిపెముల్ సల్పుచుండు
ఎందాక నా శర్వుఁ డింపుతో నుమ వామ
భాగార్ధచారియై వరలుచుండు
రహిని నందాక తన కీర్తిరమ వికాస
పరిమళము దిక్కు లందున ప్రజ్వరిలఁగ
రాజపుర మేలు గావుత రామకృష్ణ
ప్రభువుఁ లాయురారోగ్య సంపదలతోడ. 30



# భారవి

## ప్రథమాశ్వాసము

చ. అణువును గొండగాఁ బెనుప
నాకసముల్ లసమాత్ర సేయ నే
ర్పును గలఁ డౌచు; రాచఱిక
ముం దొలఁగించి నరేంద్రునైనఁ దా
నణఁచి బికారిగా తిరుగ
నట్లొనరింప; జగంబు విస్మయం
బునఁ గనుగోఁగ; సత్కవియు
ఔ; పతులందు మనీష పెంపునన్. 1

సీ. మబ్బుగుత్తాలపై సబ్బురంబుగ స్వారిఁ
గావించు చుండు నాకాశవీధి
పుష్పాదుల హరించి పోగరెక్కి తిరుగు లే
గాడ్పు కుఱ్ఱలతోడఁ గలిసియాడు
"చందమామకు నీకు సంబంధ మెట్లని"
ముసలమ్మ కడ కేఁగి ముచ్చటించు.

అలఁతాఁకుడుచేతఁ జెలరేఁగు నీటితుం
పురులను తత్పూర్వ చరిత మడుగు

గీ. పరికృతి కాంతారచిత భవ్యపాఠశాల
నొజ్జయౌచుఁ గళార్థుల కూహలందఁ
జేయుచున్ దివ్యగీతికల్ వ్రాయఁజేసి
వాణి బాడించు నాకాశవీణ మీఁద. 2

గీ. కవన మనుపేరి సవ్యసా ఖనిని మేలి
పలుకు రవలను గడియించి భద్రపఱచి
వాఙ్మయపు టంగడుల నూరివర్తకులకు
వాసిగా విక్రయించు సలీసు వెలకు. 3

చ. పరివిమల కావ్య సౌధముల
భాసుర నూతన భావచిత్రముల్
జవరసగాఁగఁ దీర్చుఁ దన
చాతురి యే తటి ఖ్యాతి నొంద, భూ
ధవబుధరాజ సద్రసిక
తండము లీతనితోడ సాటిగా
రవని యటన్న సత్కవుల
యద్భుత చాతురి బుద్ధి నెన్నఁగన్. 4

గీ. సుకవి రాజన్య రచితనిస్తులితపద్య
మొక్కటియెగాక సరియింప కున్న దేది?
సత్కవీశ్వర కృత కావ్యచయమె లోక
మందు నా చంద్రతారార్కమై వెలుంగు. 5

చ. పదముల సొంపు నింపి; తగు
భావ రసాదు లిమిడ్చి, పద్యముల్
పదిలముగా రచించి కవి
వర్యుఁడు వానిని విక్రయించుచోఁ
జదువుల మర్మముల్ దెలియఁ
జాలు నృపాలుఁడు రత్నరాశి స
మ్మదమున నిచ్చియుం గవి శ్ర
మమ్మును దీర్పఁగ లేఁ డొకింతయున్. 6

సీ. రారాజు చర్య వర్ణన సేయుసమయానఁ
దాను రారాజుగాఁ దలఁచుచుండు
దీనుని వర్ణింపఁ దవురు నవ్వేళను
దాను దీనుండుగాఁ దలఁచుచుండు
భీరు నైసర్గిక విధము వర్ణించుచోఁ
దాను భీరుండుగాఁ దలఁచుచుండు
పటువీరవరుని దెల్పంగ నూల్కొనునేని
తాను వీరుండుగాఁ దలఁచుచుండు

గీ. నిటులె యెవ్వానినేఁ, జెప్ప నెంచునప్పుడు
తాను నట్లుగ మారి తాదాత్మ్య మంది
కావ్యమును వ్రాయు కవి మేటి గాకయున్న
తత్తదనుగుణరస మొప్పఁ దాండవించు. 7

సీ. ఒకసారి మనమున నుదయించు పేశల
భావ వీచికలపైఁ బరుగులెత్తు
ఒకసారి తనచేత నొఱపిడిఁ బొందిన
పదవజ్రజాలముం బాఱఁజూఁచు
ఒకసారి తనదు మహోన్నతకావ్య ప
ఠన సుఖైకాబ్ధిలో మునిఁగి తేలు
ఒకసారి నిజవచః ప్రకట వార్తాహతిఁ
బరవాద మేఘాళిఁ బాఱఁజిమ్ము

నవ్వు నొకసారి సృష్టి కన్గవను గాంచి
శోకముం జెందు నొకతూరి లోకమరసి
బాలునింబోలె నొకమాఱు పరిహసించు
నొక్కవడి బ్రహ్మ దూషించు నోర్పు దక్కి. 8

ఉ. మానిత భాగ్యదేవత స
మస్త విధంబుల శోభఁ గాంచు, వి
ద్యానిలయంబునై సుకవి
ధన్యుల కాస్పద మౌచు, భోజభూ
జానివదాన్య శేఖరు ప్ర
శస్త యశస్సఖి తాండవించు ధా
రానగరంబు చెంతఁ దన
రారును పద్మపురంబు పేరిటన్. 9

గీ. అట సుశీలయు శ్రీధరుఁ డనెడివారి
ప్రాగ్భవంపు తపస్సులు పండె ననఁగ

భారవి కుమారరత్నంబు ప్రభవ మొంది
శుక్లపక్షక్షపాకరు సొబగు మించె. 10

గీ. యౌవనమువోలె నతఁడు విద్యాప్రకర్ష
నిచ్చ లభివృద్ధిఁ గొనుచుండె నిరుపమాన
కవనకాంతాలలామంబు కౌఁగిలించె
పలుకు చెలి నిండుప్రేమ జిహ్వాను వసించె. 11

సీ. ప్రాచేతసగ్రంథ పఠనైక దీక్షతఁ
దత్పారవశ్య మొత్తఱిని జూపె
వ్యాసభట్టారకు వాగమృతంబును
దెగఁద్రావి గట్టుసఁ ద్రేఁపుఁ ద్రేఁచె
మనువు మహర్షి సమ్యగ్భావసుమరజో
వ్యాప్త గాత్రుం డయి దీప్తిఁగాంచె
పారాశరు కవిత ప్రతిభా విలాసంపు
వైజయంతవిహార వశత మురిసె
గీ. కాళిదాసాదిగా గల కవుల కవన
మార్గము లెఱింగి ప్రోడయై మహిమఁ గాంచె
నెవ్వఁ డా భారతీకృపాఽహీనఘనుఁడు
ఘనుఁడు భారవి కవిరాజుగాఁడె దలఁప ? 12

చ. తన కవితాకుమారికకుఁ
దా రచియించెడి శ్లోకరాజినే
మణిమయ భూషణంబులు, సు
మంపు సరాల నొనర్చినట్లు పృ

ధ్వని వెలుగొందఁ, సత్కవులు
దీవన లిచ్చుచు మాటిమాటి కా
తని సుగుణంబులన్ బహువి
ధాల నుతించుచు నుందు రెప్పుడున్. 13

గీ. వన్నెచిన్నెల నలరారు వాక్యభిత్తు
లందుఁ బదకుంచికలతోడ నంద మొందఁ
జిత్తరువు వ్రాయు కవివరు చిత్తమందు
వివిధరసముల రంగులు వెలయుఁగాదె ? 14

చ. తన పలు దాకి పోవని ప
దంబులు గానఁగరావు సంస్కృతం
బున; సమకాలపుం గవుల
బుద్ధుల కందని యంత మొలుక్క భా
వనముల కర్థమై, ప్రకృతి
వర్ణన సేయఁ దురాయిదాలు పా
తని దగు నర్థగౌరవవి
ధానము గానఁగ నౌనె ? యన్యులన్. 15

సీ. అవని భర్తలు పంపు నాహ్వాన లేఖాళి
కట్టలు కట్టలై పెట్టె నిండ
చూపుల వ్రేలాడు సురుచిరశబ్దాలు
తోరణమాలగాఁ దోఁచుచుండ
తన తెల్వి తేఁటలకును మెచ్చి హర్షించు
భారతీదేవి దీవనల నిడఁగ

మాటిమాటికిఁ దన మనమునఁ జనియించు
కుదురైన భావముల్ ముదము పెంప.

గీ. కాలుఁ గదలింప కుండనే కలిమిచెలువ
తనకుఁ దా వచ్చి సంతతోత్సవముఁ గొలుప
సాటి కవిజాల మందు కిరీటధారి
యో యన నతండు వర్తించుచుండు నెపుడు. 16

చ. రస మొలికించు కైతయును
వ్రాయు సమర్థతఁ గల్గు నాఁడె, యిం
పెసఁగొని శాస్త్ర గర్భమున
నేరికిఁ దోఁపక దాఁగి యున్న వె
ల్గ సరస రీతి వాని కను
లం బొడఁగట్టుచుఁ దత్క్షణంబ ది
వ్య సుమము లట్లు వెల్గుట మ
హా కవు లెప్డు నుతింతు రాఘనున్. 17

చ. పరిమితి లేని భారవి య
భంగుర భావపయోధి నెంతయున్
దఱచు కొలందిఁ దోఁచెడు ను
దాత్తపదోత్తమరత్నపుంజముల్
విరళతరధ్వనిచ్ఛటలు
విశ్వజనీనరసప్రవాహముల్
తరమె నుతింప వాని మతి
దార్ఢ్యము పాండితి నెంతవారికిన్ 18

సీ. ముఖపద్మమున కాంతి పుంజంబులోపల
నివసించె వాసికన్నియ బెడంగు
అర్థగౌరవ కిరీటాగ్రసీమల పలు
కులచెలి మొలకనవ్వులు చెలంగ
లలిత ఘంటా సువిలాసంబులో దాఁగి
యున్నది సర్వజయోరువార్త
హృదయసుక్షేత్రాన నుదయించి ప్రవహించె
మానితభావంపు తేనెవాఁక
గీ. పూజ్య కవితా విశాల సామ్రాజ్య పట్ట
భద్రత వహించి, భూమ శబ్దప్రపంచ
పాలనముఁ జేసి, తన్మహాపాండితీ ప్ర
భావ మతిలోకగణ్యమై భాసిలంగ. 19

సీ. తన పలు దాఁటి వచ్చిన పదం బెది యైన
రమణీయ మైన వజ్రంపు తుంపు
తన హృదయాన దోఁచిన దెట్టి తలఁపైన
తరిఁగి పోవని యమృతంపువెల్లి
తన చేతితో లిఖించిన శ్లోక మే దైన
సమసి పోవని శిలాశాసనంబు
తన దరిశనముఁ జెందిన నిరక్షరుఁ డెవ్వఁ
డైన పండితుఁ డయి యలరవలయు
గీ. కవన మల్లంగఁ దలఁపూని కలముఁ బట్ట
తనకుఁ దా నయి భారతి తాండవించి

మృదుమధుర శబ్దములతోడఁ గదలి వచ్చు
పరుల కేరిక్కి రాని భావములతోడ. 20

చ. జనకుఁడు గూడఁ బండితుఁడె
శాస్త్రపు వాదములందు మంచి పే
ర్గొనిన విశారదుండె, సరి
కోవిదులెల్ల నుతింపనిల్చెఁ, ద
త్తనయుఁడు నల్లె? పండిత ప
దంబున కేమి కొఱంత? రత్నపుం
గనులను జాతిముక్కఁ గనఁ
గా నగునే? ధరణీతలంబునన్. 21

గీ. కొడుకు కీరితిఁ గూరిచి గొప్ప కవులు
తండ్రిమ్రోలను పల్మాఱు తఱచి తఱచి
బహుగతి నుతింపఁ గోపించి బాలకుండు
పొగడఁ దగఁ డను గాని, యుప్పొంగఁ డెప్పుఁడు. 22

గీ. పుత్త్రగుణములు తండ్రులు పొగడఁజెల్లు
దంచు లోలోన హర్షింతు రమలమతులు
పొగడినను నాయురభివృద్ధి పొసఁగకుంట
నజ్ఞులెఱుఁగక పొగడిక లాడుచుంద్రు? 23

ఉ. ఏ సభఁగాని పండితక
వీంద్రులు తన్గణుతించు పట్ల సం
తోసముఁ జెందఁబోవక యొ;
దుష్టునిరీతి, విరోధిభాతిఁ, బే

రీసును గాంచినట్లు కడు
నేవముఁ జెందును తండ్రి యంచు నే
రో ! సభయందునో పలిక
రోసము రాజఁగఁజేసె నెంతయున్. 24

ఉ. స్వాంతము శాంతి వీడఁగ వి
షాదపు మబ్బులు మానసాంబరం
బంతయు నాక్రమించె, నొరు
నాత్మ నెఱింగెదు నింగితంపు సా
మ్మంతయుఁ బోయె, క్రోధయుత
మ్మై కనుపట్టు మనంబు వానినిం
జింతల పాలుఁజేసె, నిఁక
చిత్తము తత్తర మందకుండునే ? 25

మ. నను స్తోత్రం బొనరించి కావ్యముల నా
నందంబునన్ వల్లెవే
యనివారున్ వినకుండువారు కలరే
యావజ్జగం బందు నిం
డెను నస్మద్ఘన కీర్తిచంద్రికలు, తం
ద్రిం జూడఁ జిత్రంబు దోఁ
చెను నన్నోర్వని హేతు వెయ్యది? యుదా
సీనంబుగా నుండఁగన్ ? 26

చ. జనకుని భావమున్ దెలియఁ
జాలక చాలవివేకి యయ్యు శా
స్త్రనిచయ వేత్తయు న్సుగుణ
శాలియు,మాన్యుఁడు నయ్యు గాని నె
మ్మనమునఁ దోఁచినట్టి యభి
మానము పేరిమిఁ జిత్త మెంతయున్
గినియఁగఁ దండ్రినిం దలఁచు
గిట్టనివాని విధానమెంతయున్ 27

క. తనయుని మనమునఁ గల యీ
ర్ష్యను గురితింప లేక సత్యాత్ముం డా
జనకుఁడు ప్రేమాంబుధిలో
మునుఁగుచుఁ దేలుచును నుండె ముఖ్యులయెదుటన్. 28

సీ. అఖిల వేదముల రహస్యంబు లెల్లను
విపులం బొనర్చు కోవిదుల తోడ
వ్యాకరణాదిశాస్త్రాళికి భాష్యమున్
వ్రాసిన పండిత వరులతోడ
చిత్రబంధశ్లేషసిద్ధిఁ గవిత్వముఁ
గావించు నుద్దండ కవులతోడ
ప్రౌఢ వాఙ్మయ కావ్య పర్వతంబుల నుండి
రసముఁ బిండిన విమర్శకులతోడ
గీ. చేతనాచేతనము లెల్ల చెమ్మగిల్ల
భ్రాంతిఁ గొల్పెడు గానవిద్వరులతోడ

సద్భూతానందదాయకం బై వెలుంగు
నొక మహాసభ జరిపెడి యొక్కనాఁడు. 29

గీ. చాల పేర్గొన్న భారవి జనక సహితుఁ
డై మనస్స్పర్థ నీలమేఘాళి గ్రమ్మ
దుర్వికార నిమగ్న దోధూయమాన
చిత్తుఁడై తత్సభాస్థలిఁ జేరఁబోయె. 30

ఉ. వేలకు వేల పండితని
వేశము నం దొక ప్రశ్న గల్గఁ జి
త్తాలు పరిభ్రమించె, బుధ
తండము దానినిఁ దీర్పకున్న, య
వ్వేళను భారవిం గనఁగ
వీరత నిచ్చి సదుత్తరంబు ను
త్తాలజయాంక కేతన ము
దగ్రత నాటె దిశాదశస్థలిన్. 31

శా. ఊరేగించి గజోత్తమంబున మహో
ద్యోగుల్ క్షమాధీశులా
వారల్, భారవి సంస్తుతించుచును త
ద్వాక్ఛక్తి ధీశక్తి కెం
తే రమ్యం బగు రాంకవాదులను ను
ద్దీపించు భోగాళి పెం
పారన్ గూరిచి మేల్ భళీ యితని దా
పాండిత్య మం చెంచుచున్. 32

క. కొమరుని విజయం బారసి
సుమనస్కుఁడు తండ్రి వాని స్తోత్రంబునకుం
దమకక నుతింపకుండెను
క్రమమే గద పుత్త్రు మేలుఁ గాంక్షించు టిలన్. 33

చ. పొగడక యున్న మానె, కడు
పూనికఁ బొగడ్తలఁ దెల్పువారితో
"మిగులఁగఁబల్కఁ బోవకుఁ డ
మేయగుణాత్ములు మీరు బాలుఁడే
యగుగద, మీదు దీవనల
నందఁగ నోపినవాఁడు పొందితిన్
దగడు నుతింప" నన్న వచ
నంబులఁ బల్కఁగఁ జొచ్చె నయ్యెడన్. 34

ఉ. ఆ వచనంబుచేఁ గుమిలి
యా సభనుండియు లేచి పోయి దు
ర్భావముతోడఁ దల్లికిఁ గ
రం బహితం బని యెంచఁ బోక, ప్ర
జ్ఞావహమైన చిత్తము వి
చారముఁ దోఁపఁగ విన్నవించెఁ గ్రో
ధావిల మానసుం డగుచు
తండ్రి విధం బిసుమంత దాపకన్. 35

గీ. ఎన్నిరో యేండ్లు గడచె నా కన్నతండ్రి
నన్ను మెచ్చఁడు సభలలో నెన్నఁడేని
పండితుల ముందఱను నన్నుఁ బరిహసించు
గానఁ దండ్రిని వగియింతుఁ గరుణమాలి. 36

ఉ. కన్నకుమారకుండు పితృ
కంఠముఁ ద్రుంపఁ బ్రతిజ్ఞఁబూనె, నే
తెన్నున మానిపింతు నని
దీనదశం దురపిల్లి భారవిం
గన్న పడంతి యొప్పగిదిఁ
గాంతునిఁ బ్రోవఁగలట్టిదాన, వీఁ
డన్ననొ పండితాగ్రణియు
నయ్యు, సపండితు నట్లు వాకొనెన్. 37

మ. కొడుకా ! నీకు యశోవధూటికి ననుం
గుణ దేవిగాఁ జేసి, నీ
సిడ మెత్తించిన కైతకన్నియకు నా
సిం గూర్చి పోషించుటో ?
పుడమి న్నిపయి శాఁచేఁ గడియు నా
ప్రాఁబ్రోడ్పఁ బెంప్ప నుటో ?
బహుగుం దండ్రినిఁ ద్రుంచు టన్న ఘనమా
పాపంబు చేకూరదా ? 38

చ. జనకునిఁ జంపఁగాఁ బ్రతిన
సల్పుట ధర్మముగాదు పుత్త్రి! యీా
తని హృదయం బెఱుంగక వృ
థా పితృహత్యకుఁ బూనబోకు, మ
య్యనఘుని కేల నీ పయిన
నార్యహితం బగు నీర్ష్య గల్గు, నే
వినిచి యెఱింగి పల్కెద వి
వేకము కల్గిన మాను మిప్పనిన్. 39

క. అని తల్లి దీనవాక్కులఁ
బనివడి వచియించి తనయుఁ బశ్చాత్తప్తుం
బొనరింపలేక, బతి ద
ర్శనమునకై వేచియుండె సౌధాంతమునన్. 40

మ. తనయోత్సాంసు జయోదయంబునను
త్సాహస్ఫీతుండై సభా
జను లే యే విధ నాడికొంట వినుచున్
సామర్థ్యమున్ జాటుచున్
జని గేహంబున భుక్తి సల్పి, సుఖమై
శయ్యాస్థలిం జేరి, చే
రిన భార్యామణిఁ జూచి హృద్వ్యథను
దీర్కింప నిర్ణయించెన్. 41

ఉ. మానిని వింటివే మన కు
మారుని ధీజవ మెల్ల దైవతే
శానుని దేశికుం గెలువఁ
జాలిన పండిత మాళ్ళు లందరుఁ
గానుక లీయ గెల్పుఁగొనెఁ
గాంచితి మీతని పుత్త్రి గాఁగ నీ
సూనుని పుట్టుకన్ గులము
శోభిలె నేమని చెప్ప నేరుతుఁ. 42

క. ఎంతటి పాండిత్యం బొకో ?
యెంతటి ప్రజ్ఞ యొకో ? యొక్కఁ డేనియు సభలో
వంతునకును రా నోపెనె
కాంతా ! మన తపము నేఁడుగద ఫలియించెఁ. 43

చ. హృదయమునందు మెచ్చెదను
నే నది నెమ్మది నాసికొంచు న
య్యదనున నాతఁ డెంత ఘనుఁ
డంచును పై కవి యేలయన్న, సం
పదయును, భార్య సుందరత,
పట్టి మహత్త్వము ప్రాజ్ఞుఁ డన్నఁ జె
ల్లదు చెలికన్న ! యియ్యది క
ళావిదు లంద ఱెఱింగి నట్టిదే ? 44

చ॥ "తనయుని కీర్తి తల్లియును
తండ్రి నుతించిన వానివృద్ధి నా
శనమును గోరు నట్లు", యని
సంతసము న్వెలిబుచ్చుకుందు, "నా
తనయుని కన్న మిన్న లల
ధాతయు దేవగురుండుగాక" యం
చనయము నేఁ దలంతు నిజ
మంగన ! యన్నఁ జెలంగి కాంతయున్. 45

గీ. హర్షపులకిత గాత్రియై యాత్మవిభుఁడు
బ్రతికె నీ నాఁటి కని చాల ప్రమద మొంది
యనఘ ! మన కాపద యొకండు పెనసివచ్చి
దైవకారుణ్య బలమునఁ దప్పి పోయె. 46

క. అను ప్రేయసిఁ గనుఁగొని నె
మ్మన ముత్తలపాటుజెందె మానిని ! యేలా
జనియింపనుండె కష్టము
చనె నే విధిగా వచింపఁ జాలినఁ జెపుమా. 47

క. అని నాథుఁడు ప్రశ్నించిన
వనితామణి మన కుమారవర్యుండు సభా
జనవంద్యుం డయి యుండుటఁ
గని నీవుఁ మెచ్చుకుంటఁ గష్టము దగిలెన్. 48

చ. "అడిగిన విన్నార లేమనెద"
రంచును సద్దకయున్నఁ గీడు తాఁ
బొడము నటంచు సంశయము
బుట్టెను డెందము త్రోడ నుందు, నే
నడుగకమున్నె యుత్తరము
నట్లు వచించితి రీరు లోని దం
దడి జనియెన్ శుభంబొడవె
నా మది నెమ్మదినుండె నేఁటికిన్. 49

గీ. అనుచు వచియించుచుండు వేళను తదీయ
శయనశాలోపరిస్థలి శాంతిఁ దొఱఁగి
యొండకోపనుఁ డగుచుఁ బాషాణ మొకటి
వంతునకై వైవ నుంకించి తనయుఁ డంత. 50

కాంతా! వంపఁ బాప మని
స్వాంతము వెన్కకులాగ, "దుష్టుఁ డీ
చ. హృదయము మెచ్చుఁబోక తెగ
నాడుచు నుండెఁ దెగించి శిక్షితుం
య్యెదనన్," మంచుఁ గ్రోధశిఖి
ముందఱకున్ వడి నెట్టుచుండె, వె
న్కను నుయి, ముందు గోయి యనఁ
గాలును చేయియు నాడ కాతఁడున్. 51

గీ. పెరుఁగు వస్లను గలిసిన తెఱఁగుదోఁచె
నేఁడు నా పని యెటుసేతు సిక్కుమొఱఁగి

పండితాఖండలుని నన్ను పరువు చెడఁగఁ
బలుకు నీతఁడు దోసి. యు న్పలుకు నిజము. 52

ఉ. కావున విని నెట్లయినఁ
గాలుని సద్మముఁ జేరఁ బంపు టే
భావన సేయ మేటి పని,
ప్రస్థరమా! యిఁక నాక్క వ్రేటునన్
నీ వరణీయశక్తిని గ
ణింపఁగ శీర్షము నూరు వ్రక్కలై
లావు దొఱంగఁ జేతు మది
రంజిల, నంచు వచించు లోపలన్. 53

గీ. తండ్రి వచియించెడి విఘ్నముఁ దలఁపుఁ జేర్చి
యెంత మోసంబు జరుగునేఁ డింత యనుము
జేరు నాకని యటుకపైఁ బౌరుషంబు
రూపమున గన్న భారవి రోష ముడిగి. 54

క. దిగివచ్చి తండ్రి పదములఁ
దగఁబడి పితృహంత వీఁడు, దయఁ జూడక వే
తెగటార్పుము తండ్రీ! యని
వగలం బొగిలెడి మనీషివర్యునిఁ గొమరున్. 55

క. కరుణామయిఁ గాంచి నీ దగు
దురితము నశియించె లెమ్ము! దోషివి యయ్యున్

బొరపాటెఱింగి, యది క్రొ
మ్మెఱు మార్గము గనుటచేఁ గుమార వతంసా ! 56

గీ. బాల్య చాపల్యమున నిటు పట్టి ! నీవు
చేసిన దురంత కార్యంబుఁ జిత్తమందు
నిల్పుకొనక క్షమించితి, నేఁటికైన
శాస్త్రజన్య పరిజ్ఞాన సరణి మనుము. 57

క. అని చరణద్వయి విడువని
తనయు ముదశ్రువుల శిరముఁ దడుపుచు లెమ్మో
యనఘా ! యని యాదరణం
బునఁ గరముల నంటి లేపి పూని వచించెన్. 58

మ. కొడుకా! కోపపరీతచిత్తమున నా
కుం జేయగా నున్న యె
క్కుడు దోషంబు; మహావ్రతంబులను నీ
కుంబోదు, నేఁడాదిగా
వడి నీ మామ గృహంబుఁ జేరి యొక య
బ్దం బుండినం బోవు, నా
నుడు లాలింపుము శిక్ష నీ కిదియె; త
జ్జ్ఞల్ మెత్తు రిద్దానిచే. 59

---

# ద్వితీయాశ్వాసము



ఉ. భారవియు న్వివేకి జన
వంద్యుఁడు గావునఁ జింతనొంద కే
తీరున నైన దోషలతఁ
ద్రెంచుటయే పదివేల పున్నెముల్
గూరినయట్లు నా కనుచుఁ
గొంత మనంబునఁ జర్చ సల్పి శ్ర
ద్ధారుచిభక్తి నయ్యనుఁగుఁ
దల్లికిఁ దండ్రికి మ్రొక్కి చయ్యనన్. 1

గీ. సెలవుఁ గైకొని శయ్యకుఁ జేరి, రాని
నిద్దురం గొంతవడి నుండ; నీరజాప్త
బింబ మవ్వాని దోషంబు ప్రిదులపఱుప
వేగిరము రాఁ దలంచిన విధముఁ దోఁప. 2

సీ. కొక్కొరోకో యని కోళ్ళు కూయఁ దొడంగెఁ
జెలఁగి గేహాంగణ సీమలందు
కర్షకవసతి ఱోఁకళ్ళచప్పుడు సాఁగె
నన్నంబు గావించు నట్టి పనికి
నెద్దుల మెడలపై నేళ్ళను కాళ్ళను
జేర్చిరి హాలికుల్ చేలకేఁగ
దధిభాండముల గోపతరుణులు చిలుకుచుఁ
బాడఁగాఁ జొచ్చిరి పాటగముల

గీ. చీఁకటియు గొందులందూఱె, ఘూకతతికి
భయమునుం దొట్రుపాటు నేర్పడియె, నాల్గు
దెసలు తెలుపెక్కెఁ, దోఁచె నద్దినకరాంశు
జాలములు బంగరువుచాళ్ళ చాయ నంత. 3

ఉ. రాత్రి గతించె నెట్లో; దిన
రాజుదయాద్రినిఁ గొల్వు దీరెఁ, బ్రా
భాత విచిత్రచిహ్నములు
భాసిలె దిక్కుల, నంత నాతఁడు
స్నాతులగేహసీమకు గ్ర
మంబుగఁ బైనమొనర్చి యందు రా
మాతిలకంబు భార్య గల
మాటఁ దలంచుచు మోద మొందుచున్. 4

గీ. తగ నుషఃకామినీ మహోద్వాహవేళఁ
జల్లికొను నెఱ్ఱ బుక్కాము సౌరుమీఱఁ
దనదు తనుకాంతి కొక క్రొత్త తళుకొనంగ
నరుణరుచితోడ నలరె నయ్యరుణరోచి. 5

ఉ. రాజితదేహుఁ డౌచు దిన
రాజు జగంబును బ్రోవరాఁగ నీ
రేజవధూటి యాతని వ
రింపను మిక్కిలి ప్రేమతోడ నీ

రాజన మిచ్చి, భర్మమణి
రాజిలతానుమహారపాళి వి
భ్రాజిత కంఠ దేశమున
వైచె ననం గరణాళి యొప్పెడిన్. 6

మ. అది కార్చిచ్చులు రేగు వేసవి; జలం
బపాస్త, మాశాపథూ
వదనంబుల్ వడదాఁకె, భానురుచి తీ
వ్రింబయ్యె, నా మేఘసం
పద యే దేశము పాఱిపోయె, ధనికా
వాసంబుల స్వట్టివే
ళ్ళదడుల్ వేల్లిఁ దొడంగె, క్రొంజిగురు కా
లంబయ్యె చూతాళికిన్. 7

సీ. వడగాలి పోఁతకు వడఁ గొనియుంగూడ
నెండమావుల స్వారి నిచ్చగించు
చెమట చిత్తడిచేత సిల్గు చెందియుఁగూడ
సుడిగాడుపుల వింతఁ జూచుచుండు
కటికి యెండను బిట్టు గదలుచుండియు మేటి
గాములతేనితోఁ గలియఁగోరు
దాహంబుచే నాల్క తడియారియున్ మించి
ప్రకృతి గీతావళిఁ బాడుచుండు
గీ. భయముఁ బుట్టించు సత్త్వశబ్దాల వినుచు
నబ్బురముఁ జెందు, స్నేహింప నలరుచుండు

కన్నులంజూచు బ్రీతి దానిఁ గర్జ మనుచు
తనవిగా నెంచి గాంచు సత్కవి యతండు. 8

గీ. కష్టమనఁబోఁడు సౌఖ్యంబుఁ గాదనండు
తన్మయత్వాన దిరుగాడు తలఁపుతోడ
మందమందంపు గమనాన మానసంబుఁ
బ్రకృతి చిత్రాలపై నుండి సుకవి నడచు. 9

సీ. పండుటాకులఁ జూచి పకపకనవ్వేడు
కిసలయమార్ధ్వ రక్తిమ మెఱింగి
అవని వైపునఁ జూచి యశ్రువుల్ విడచు నూ
సరవెల్లి మార్పు విషయ మెఱింగి
తూలుచు తోలు వాతూలంపు బెనుపరా
క్రమమును తజ్జనుగతుల నెఱిఁగి
కొండగుహల దాఁగి కులుకుచు నవ్వించు
ప్రతిశబ్ద సఖుని భావం బెఱింగి

గీ. తొఱఁగు కన్నీటఁ దడపుచు ధరణియెల్ల
ధవుని దర్శింపఁ దిరుగు పతంగిహృదయ
తాపమునఁ గుంది తన యాత్మ తన్వి యిట్లె
యెడరునని యెంచి పయనంబు వడి నొనర్చు. 10

చ. అలసటఁజెంది చెంది పథ
మందొక దీర్ఘికఁ గాంచి తత్సుధా
జలములఁ గ్రోలి కొంతవడి
చక్కగ నిద్దురవోయి లేచి ని

మ్మెళముగ సాఁగి సాగి యట
మార్గమునందునఁ దోఁచు చిత్రముల్
గలయఁగఁ జూచుచుఙ్ మదికి
గంపము సంతసముఙ్ జనింపఁగఙ్. 11

చ. పడమటి జవ్వని న్నిశిత
భానుఁడు ప్రేముడిఁ జేరఁబోయె న
య్యెడ; మన సత్కవీంద్రుఁడును
నీ యెడ మామగృహంబునందు నుం
డెడి తన ధర్మపత్నిని గ
డింది ముదంబునఁ గాంచు కూర్మి న
ప్పుడె ధనదాపురంబునకుఁ
బోయెను నెన్నడు పోకపోకయుఙ్. 12

చ. అతుల యశోవిహారుఁ డగు
నల్లుని రాకకు సంతసించి, స్వా
గత మిడి, క్షేమవార్తలను
గ్రచ్చఱ ముచ్చటదీఱఁ బల్కి సం
చితమతులైన స్యాలకులు
చెల్లెను గన్న పడంతి బాంధవుల్
గుతుకముమీఱ ముచ్చటలఁ
గొండొక కాలముఁ జేర్చి రాతనిఙ్. 13

గీ. హృదయపాత్రాన తొలుకాడు ప్రేమరసము
వెలికి జాల్గట్ట నయ్యాత్మవిభుని పాద

పంకజయుగంబు తద్రస ప్లావనంబు
గా నొనర్చి నివాళి త త్కాంత యొసఁగె. 14

గీ. నల్లగల్వలఁబోలు కన్గవల నుండి
పొడమి యానంద ధార లుప్పొంగిపొంగి
పైకిరాఁ జూడఁగా మనోభావములను
మృదుల భాషణముల వచియించె నింతి. 15

గీ. ప్రకటమేఘోదయంబు చాతకము వోలె
పశ్చిమాంగన యిను రాక భ్రమసి కోర
తన్మనోభీష్ట సిద్ధికై తరలె ననఁగ
సరసిజాప్తుఁడు పశ్చిమాచలముఁ జేరె. 16

చ. వలఁగొని చిమ్మ చీఁకటులు
పర్వెను దిక్కుల వింతవింతగాఁ
బులుఁగులు జంటలై మురిప
పుం బసిపిల్లలఁ జూచు కాంక్షతో
నలసి కులాయముల్ దరికి
నాతురతం జనె, భీరుచిత్తముల్
గలఁచె నిశీథదేవి యధి
కారపుదండముఁ జూపె రోదసిన్. 17

ఉ. మాడకుమాడ యెత్తుగల
మాటలతోఁ బ్రియభోజనాలతో
నాడెపు చూపుతోఁ గని మ
నంబునఁ దృప్తి జనించునట్లుగన్

వేడుక నెల్లవారు కవి
వీరునికిఁ మనుగుడుపుఁ జేసిరా
మూఁడు దినాలు స్వర్గమిది
పో యని యాతఁడు పొంగి తేరఁగన్. 18

గీ. మూఁడుదినములు నన నల్లుతోడ నత్త
వారు తమరాక కేమని ప్రశ్న వేయఁ
దనదు సపచార కార్యంబు జనకుఁ డొసఁగి
నట్టి శాపోక్తి యంతయు నతఁడు దెల్పె. 19

గీ. మూతివిఱిచిరి ప్రేమసముద్ర భంగ
ములకు భంగంబు ఘటియిల్లె ముదము చెదరె
వ్రేలుమడచిరి యున్నదినాల నెంచి
యత్తగారింట నలజడి యంకురించె. 20

మ. దినముల్ దాటు కొలంది యాదరము నెం
తేఁ దగ్గఁగాఁ జొచ్చె, భో
జనపానాది విధాలు మారినవి దు
ష్ప్రాపత్యముల్ రేఁగి, సం
జనితామోద వినూత్న భావములు నా
శంబొందె కొన్నాళ్ళకే,
ఘనుఁడౌ నల్లుని కింక, లాతుల కెటుల్
గావచ్చు నత్తింటిలో ? 21

చ. గునపముఁదట్ట చేతి కిడి
గుంటలు ద్రవ్వఁగ బావమర్దు లా
జ్ఞను నిడ, దానినెంతొ శిర
సావహించి యొనర్చు; గంటముం
గొని శరధాటి వ్రాయుచు మ
ణుల్ గొనునట్టి కరాన కౌర! దై
వనియతి నెంత లెంతలు వి
పత్తులు వచ్చెఁ గటా! యికేమనన్. 22

ఉ. వేకువ జాము మేలుకొని
వేగమె కార్యము లాచరించి వా
రే కడ కేఁగు మన్న సరి
యే నని పోవుచు నద్దిజేసి పే
రాఁకట నిల్లుఁ జేర నొక
రైనను బల్కరు; ప్రేమఁజూప రా
రా! కఠినంపు దీక్ష యితఁ
డన్నియునున్ భరియించు వేత్తయె. 23

గీ. దేవునకు మించు దేవుండు, దేహమునకుఁ
గారణుం డగు తండ్రిని కట్టెడి నయి
యెఱుకదక్క యొనర్చు నహీనకృతికి
యిదియె ఫల మింక దోసంబు నేది లేదు. 24

మ. అని చింతించెడు భారవిం గనియుఁ బో
యాలా రిమ్మెఁ జేరి పా
యని దుఃఖాశ్రుపరీత నేత్రముల నా
థా! యెన్నికష్టాలు వ
చ్చెను నీ బోఁటికి; చూడఁజాల నిసిరో
సిగ్గయ్యె నా యాత్మకున్
మన యైశ్వర్యముఁ బాసెనో; మఱియు నే
మార్పొందెనో? తెల్పుమా. 25

గీ. జ్ఞానహీనుల నధిక కష్టములు జెందు
గాన మీవంటి సుకవిశేఖరుల కెందు
నేని కష్టలవం బంటునే దలంప
నర్కబింబంబునకుఁ దమ మంటినట్లు. 26

గీ. కావునను దెల్పవలయు నీ కష్టదశను
నేను జూచి భరింప; దైవానుకూల
మింత దప్పిన నెటకేని నేఁగవలయుఁ
గాని యిటనుంట మిక్కిలి కాని పనియె. 27

క. అని వగచు కాంతతో "మ
జ్జనకుం డత్తింట నుంట చను నీ" కనుచున్
మును బల్కి యుంట కష్టా
లిని జెందుచునుంటి నతివ! లెక్కిడ కిందున్. 28

గీ. మనకుఁ బూర్వము గలవెవ్వి మాఱలేదు
మందుఁడగు మందుఁడిట్లు నా యంద ముడిపె
నొక్క యగ్గంబు నెగ్గిని యోర్చికొనుము
మనము నిందుండవలయు మా జనకు నాజ్ఞ. 29

గీ. వనిత! యీ యాజ్ఞ నాకు నొక్కనికె గాని
తక్కు వారి కొకింతేనిఁ దగుల బోవ
దోర్చినను నిందయుండు, మట్లోర్వలేక
యున్న మన పురికేఁగు సౌఖ్యోన్నతికయి. 30

క. అని సెలవిచ్చిన నాథుని
మనమున కొప్పిదముఁగూర్ప మగువయు నిం దే
నును నిలిచి వత్సరాంతము
మన పురికి న్వత్తునంచు మఱి యుండు నెడన్. 31

ఉ. చీటికి మాటికిం గసరి
చేసిన యూడిగ మొప్పకోక, నీ
వేటికి మా గృహాన వసి
యించుట? తోఁచక కూఁతు నెత్తిపై
మూఁడుడు నగ్ని ఖండములఁ
బోసిన తప్పున మాకు మేము చీ
వాటులఁ బెట్టుకొంటి మిఁకఁ
బాఱుము వచ్చినత్రోవ నూరికిన్. 32

ఉ. అల్లుఁడు భాగ్యవంతుఁ డని
యందఱు ముందఱ నుబ్బుచుంటి వా
యిల్లును గుల్ల సేయుటకు
నియ్యెడఁ జేరెద వంచు నెంచలే
దల్లుఁడ! కూఁతు నిచ్చుతఱిఁ;
నైనది యయ్యె నిఁకేమిసేయ మా
యిల్లును వీడి పొమ్మటకు
నేనియు నిన్ను భరింప మింతకుఁ. 33

ఉ. ఎందఱు తూలనాడిన ము
కుందుఁ తన్ను హాసించుచుండిన
గుందడు; కోపమూపుకొను,
కూరిమి భార్య యపూర్వబంధముం
బొందక వెళ్ళి పొమ్మనక,
పోదమటన్నఁ దరింప రాని శ
తిం దన తండ్రి శాపముగ
తిం దలపోయు నొకింత ఖిన్నుఁడై. 34

క. ఇలుదాటి వెడలి పోవఁడు,
కల బందుగు లెల్ల నొకటిగాఁ గూడి తనుఁ
బలువిధముల దూషించిన
కలహింపక యూరకుండు కర్మవశుండై. 35

గీ. విసుగుఁ జెందక కుందక వెడలి పోక
యున్నయల్లుని తత్త్వంబు నూహాజేసి
పొలము కావలి యుద్యోగమును ఘటించి
కసరి పంపించుచుండు నాగాలు లేక. 36

ఉ. ఆతఁడె సమ్మహాకవి మ
హత్తర సంస్కృత కావ్యసౌధమున్
బూఁత సువర్ణ వర్ణములఁ
బూన్చి సుశబ్దపు రత్నజాలపున్
జ్యోతుల బారుల న్నిలిపి
సొంపులు నింపుచు రాజకీయపు
న్నీతుల మెట్లతోఁ బృథివి
నెక్కొన గట్టుచునుండె దక్షతన్. 37

ఉ. స్నానజపాది కృత్యములు
జారె, పొలాల కహర్నిశంబులున్
మానక పోవుచుండుట, స
మస్తవిధంబుల రక్తనాళముల్
బోనములేక చిక్కినవి
పూనికఁదగ్గుచు నాఁడునాఁటికిన్
మానము పోవుచుండె నొక
మాసిన మూరెడు గుడ్డ చాటునన్.. 38

గీ. నిదుర మంచానఁ గొంగును విదలుచుకొని
పొలము వోవును, జలమును భోజనంబు
లనక కష్టించి పనిఁ జేయు, వ్యవధి యున్న
కావ్యమును వ్రాయు, నిలు సంజ కడను జేరు. 39

గీ. ఒక్కయెడ కావ్యకల్పన లూర్పులట్లు
దోఁచు నొకయెడఁ బనులు ముందునకు నెట్టు
మనసురాదయ్యెఁ గవికి చింతఁ గను మదికి
నొకటి విడనేర డింక వేరొకటి సేయ. 40

సీ. అన్నంపు లేమిచే నలసి శోషిల్లుచు
నుడుకుదుమ్ముల సెజ్జఁ బడి తపించు
తఱుఁగని పనిసేఁత తప్పించుకొని పోవు
నూహాప్రపంచాని కుచ్చులొడ్డు
తాఁ బొందు కష్టాలఁ దాలిమి వహియించు
భావిశుభస్థితిఁ బ్రస్తరించు
ప్రకృతి స్వభావాల పరివర్తనపు మాయ
లారసి లోలోన నలవటించు

గీ. శ్వశురగృహమందు వసియించువారు వల్ల
మాలిన మహానుభూతి సంపన్ను లౌదు
రని తదీయ విజ్ఞాన కావ్యమును బ్రచుర
పఱచు నూతన హర్ష భావంబుతోడ. 41

ఉ. పాప మిటెంతలో సుకవి
వర్యు మహాదశ మారిపోయి యీ
పాపశతాలయం బయిన
ప్రాయిలు ముంగిట దిక్కు లేక సం
తాపముఁ జెందగా వలసె;
తాఁ బువు లమ్మిన వీటఁ గట్టియల్
మోపుల నమ్మ హీనదశ
మోసులు సూపినరీతి నక్కటా. 42

ఉ. అందఱి భోజనంబు లగు
నంతట మాపటివేళకుꣳ బరి
స్కందునివోలె క్షేత్రమునఁ
జాకిరిజేసెడి భర్త యొద్దకుం
జిందిలిపాటు లే కరిగి
చేతెడు భిస్సటఁ గల్సి గంజి పో
యం దన నెమ్మనంబున న
యంబున సేయును దైవచింతలꣳ. 43

సీ. తెలుపారు కన్నీటి సెలయేటిలంకల
నాశ్రయువేదుల యందుఁ జేర్చి
సచ్ఛిలమణిమయ సౌధాల సిసలైన
బత్తిగద్దియల శ్రీవలకుఁదార్చి
హృదయపాత్రి ప్రేమ సదమలకల్లోల
పాలికాడోలిక పైనిజేర్చి

దుఃఖంపుటటవి పఠిత్రోళికలందు సాం
త్వనపు పరాగ వితర్దిఁ జేర్చి
గీ. భర్త కడుపులోఁ దలఁ దూర్చి బహువిధాల
కుమిలి యేడ్చి కష్టము దీర్చుకొనఁగ నుపమ
చిక్కక సతంబుఁ గుములుచు వెక్కస మగు
గడువు దినములకై భార్య గాంచుచుండె. 44

సీ. మలిన భూయిష్ఠమౌ వలువఁ గట్టునుగాని
పట్టుపుట్టంబులఁ గట్టుకొనదు
చెదరు ముంగురులకు పదనిచ్చి మెఱపెచ్చఁ
దలదువ్వి సిగముడి మెలచుకొనదు
చెమట చారలు మేని గమక మూడ్చినఁగాని
తానంబు సేయను దలఁచు కొనదు
నగలు నాణెములు సెందమికి గుందదుగాని
— పసుపు కుంకుమముల వాంఛ విడదు
గీ. మొగమునం బొట్టు సామాన్యముగ ధరించు
కడుపు కక్కుర్తికై గంజిఁ గుడిచి తిరుగు
దైవమును దూరు తన కష్టదశఁ దలంచి
యాపు రని యేడ్చు తీరని వ్యాకులమున. 45

మ. మొనగాడైన విపశ్చితుం డయిన యే
భూపోత్తముండైన నె
త్తిని కొమ్ముల్గన్న తనంత తా నరిగి య
ర్థిం దీనుఁడై యత్త యిం

టను జామాత వసింపఁ జుల్కన యగుం
దర్శించు నర్ధాంగి, యె
వ్వనికిన్ రాదు సహింప నీ యనువు
నుర్వ్యాపార మాజన్మముల్. 46

క. ఆ రీతి దినము లెట్లో
పోరాడుచు దాఁటుచుండెఁ బాద్దులువోక
న్నారయ శార్వరిణ భార్గవ
వారంబులు వచ్చె యువతి వ్రతము నోముల్. 47

మ. కని చుట్టంబులు సేయు భీషణపు హుం
కారధ్వనుల్ రేగనో;
యన గర్జించెను మేఘజాల మురవై
యర్ధాంగి దుఃఖాశ్రువో
యన నీలాంబుద మున్న చోటులను వ
ర్షారంభముం జేసె, నం
దున లేమూన తటిల్లతల్ పొడమె న
న్యాసంబుగా నెల్లెడన్. 48

గీ. పూర్వపుణ్యము చేసిన పూవుఁబోండ్లు
నోచు కొందురు కోరిన నోములెల్ల
నట్టి వ్రతములఁ దానును నాచరింపఁ
గోరియుండెను లేమిచేఁ గుందుచుండి. 49

చ. వ్రతములు రేపనంగ గురు
వారపు రోజున మాడినన్నమున్
బలి కొఱకై యథావిధిగ
భామిని దాఁ గొనిపోయి ఖిన్నయై
మఱి మొలమొల్ల నేడ్చుటకు
మాన్యుఁడు భర్త గ్రహించి యామెతోఁ
గతము వచింపఁగోరెఁ దమ
కంబునఁ జేరిచి బుజ్జగించుచున్. 50

గీ. కరుణ నోదార్చువారును, కారణంబు
లడుగువా రున్న సమయాన యంతులేని
దుఃఖములు మాటిమాటికి గొరలివచ్చు
సహజముగ స్త్రీల కెల్ల నాచార మిద్ది. 51

గీ. ఎల్లి నోములకై యున్న లెన్ని యెన్నోఁ
వలయు నగల నొసఁగిరి భార్యలకు, మాట
కైన నోములు నోచుకొమ్మనఁగ లేద
టన్న కతమునఁ జింతించి తంచుఁ జెప్పె. 52

గీ. గడువుదినములు దాదాపుగా ముగియఁగ
వచ్చినవి, యంతదాక నా యిచ్చమెలఁగు
వలయు నగలను నీవు దాల్పఁగల వంచుఁ
దాను వ్రాయుచు నున్న గ్రంథంబునుండి. 53

శ్లో. సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదమ్
వృణుతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయ మేవ సంపదః. 54

ఉ. ఏ పని సాహసించి తొలు
గింపఁగ రా దవివేక మెంతయో
యాపదఁ గోరు, సంపదలు
యాచన సేయును సద్గుణంబులన్,
కాపటికంబు హీనతకుఁ
గారణమౌ, పరికించి చక్కఁగా
లోపము దిద్దువారలకు
లోఁబడు సంపద లెల్లభంగులన్. 55

మ. అని తాటాకున శ్లోక మొండు తన కా
ర్యాసక్తిచే వ్రాసి, దీ
నిని బేహారి గలండు పండితుఁడు వా
నిం జేరి నేఁ జెప్పినా
పని తాకట్టుగఁ బెట్టి సొమ్ముఁ గొని వాం
ఛార్థంబు లీడేర్చుకొ
మ్మని వాక్రుచ్చె, ప్రియాంగనామణికి నా
శ్లోకంబు సంధిల్లఁగన్. 56

సీ. అతని నామంబు మురహారుఁ డనఁగ నొప్పి
కోటికి బడఁగ నెత్తిన మేటి, యెంత
ధనము గలదో మఱంతటికి దానశాలి
సద్గుణంబుల కిక్క, సంశయ మదేల? 57

సీ. పడఁతి! శ్లోకంబు తాకట్టు నదలి పెట్టు
కొనక కావ్యంబుఁ బ్రకటింపు మని శుభాశి
షము, జ్ఞానసముద్రుఁడు నాఁడు గాక
పరులు నా ప్రజ్ఞ నరసెడి వారు గలరె? 58

క. పతిమాటకు జవదాటక
సతి శ్లోకంబును గ్రహించి సంతోషి తరం
గితమతి యై వర్తకు నా
యతనంబున కేఁగి వ్రతమునందలి కాంక్షన్. 59

శా. శ్లోకం బిచ్చి వణిక్ప్రభామణికి నా
శ్లోకార్థ ముత్సాహియై
వాక్రుచ్చెన్; వణిజుండు నైకొని సతిం
బ్రశ్నించి సొమ్మిచ్చి యా
శ్లోకంబుం దనగొట్టముం దునిచి ముం
జూరందునం బెట్టె, తా
టాకుం బుస్తక మందు పత్రికయి వ్రా
యంజేసె నా పద్ధతిన్. 60

గీ. వణిజుఁ డిచ్చిన నిష్కలఁ గొని వ్రతంబు
వదినెయక్కల కంపును వైభవముగ
జరుపుకొనియెను హర్షాన వసుని జ్ఞాన
మహిమ సామ్రాజ్య భోగసంపదఁ దలంచి. 61

ఉ. శాపము దీరి పోయె నిట
సత్కవిగోజులు మంచి వయ్యె, సం
తాపపు టగ్నియారె నని
దాగకుఁ జెప్పి తదీయ బంధులం
బాపల హెచ్చరించి తన
పద్మపురంబుఁ గనుంగొనంగ ను
గ్రపిత చిత్తుఁడై చనె స
తీయుతుఁడై ప్రతిభాసమేతుఁడై. 62



ప్పలుగ నసంగు లుబ్బుకొని
పైకొని పొంగుచు రేఁగి భూధరం
బులవలె మిన్ను ముట్టఁ బెను
మ్రోఁతలఁ బెట్టుచు లోకభీతిగన్. 3

మ. బలిమి న్వీఁచు తుపాను తోఁపిడులకుం
గాఢోగ్ర కంపించి, యు
గ్గలపుం దుంగ తరంగ సంఘరవ మా
కాశంబుతోఁ దాయఁ, బె
గ్గలిమి న్వర్తకుఁ డేగు నా తరణి కం
గా[illegible] మునింగెన్ మహో
జ్జ్వల రత్నాళి ధనంబు మందసములే
పాడయ్యె నొక్కుమ్మడిన్. 4

క. కొందరు సాగర గర్భము
నందునఁ గూలిరి సహించు నాశన్ బలిమిం
గొందఱు నేర్పున నీదిరి
మ్రిందరి సంకలకొలంది మనుజులు చింతన్. 5

మ. జలధిం గూలిన సర్వ పాంథజన యో
షా క్రందన సంలగ్న మం
గళ సూత్రింబులు కాంతి లోకమునకుం
గప్పెన్ విషాదంపు దు

ష్కల ధనరాసులుం గలిఁగి
కాంచన మార్గము సేయు దీక్షతోఁ
గులికి విదేశయాత్రలను
గోరితి నే నడియాస పెంపునన్. 9

గీ. కడలి నడుమఁ దుపానులు కానరించి
నగలు రత్నాలతోఁ పాటు నావ మునిఁగి
నను దరిద్రునిఁ జేసెఁ జండప్రచండ
కాల పురుషుండు చెలరేఁగి గడియలోన. 10

చ. అడిగినవారి కిచ్చుటయె
యాచకనాధికబుద్ధిగాని నే
నడుగఁగఁబోను, లేనిదను
నర్థమదంబున విఱ్ఱవీఁగుచున్
పుడమి సమస్త వస్తువులు
బుద్బుదతుల్యము లంచు నెంతు నె
ప్పుడును, విరోధ కార్యముల
పొంతకు బుద్ధి మఱల్పకుండఁగన్. 11

ఉ. స్వీయచరిత్ర మెప్పుడును
జెప్పుకొనంగను వాఁడగాదు, నా
కీ యెడ లేరు నేస్తులు మ
ఱెవ్వరు, హస్తముఁ గ్రిందుజూపుటన్

కోయు మనస్సు, నెట్లయిన
నుం దరిమూలిన రోజులందు నేఁ
జేయున దేమి లేక యిటు
జిక్కితి మిక్కిలి చింతఁ గుందుచున్. 12

మ. అనిశన్ బాంధుఁడు సావకాశముగఁ దా
ద్వైపారి దిక్కొంచుఁ బ్రా
ర్థన సాంతంబుగఁ జిత్తగించి తనలోఁ
దానేమొ చింతించి నె
త్తిని చిత్తంబు వెలార్చి సాంత్వనపు టె
ద్వద్వాక్కులన్ బుజ్జగిం
చి నయంబున్ బ్రవచించె నూత్న పథమున్
జింతన్ వెసన్ బాపఁగన్. 13

చ. ఇది యొకలంక, సింహుఁ డను
నేలిక మున్ గనిపెట్టె రాజ్యము
న్విదితయశుండునై సిరిసి
విశ్వము తన్ను నుతింపుచుండగా
'కుదురుప' దేశ నామ మిడి
కోరి వసించెడి పట్టణాని క
క్కడటున బెట్టె సింహపుర
మంచును సార్థకనామమై తగన్. 14

సీ. పుట్టి గోచులు బెట్టిన పూటనుండి
పౌరుషపు నెత్తురుల వార్థిఁ బరుగులిడుచు

సాము గరిడీలు నేర్తురు సమరదీక్షఁ
బిడుగు తునకలె యవ్వీటి పిల్లవాండ్రు. 15

మ. ధనధాన్యంబుల కాటపట్టు డమరో
దగ్రింపు టుద్వోగ్నముల్
గన నీ దేశమునందు నున్న ధనకాం
క్షం గ్రూరకార్యాలపై
మనసుం బెట్టఁగఁబోరు, యాచకుల స
న్మానించు నాచారమే
మునుజన్మంపు తపంబుభావము సత
మ్మున్మ్ రాజు లవ్వీటిలో. 16

చ. బలిసి మదాంధులై గవిసి
పౌరుషము న్నిగిడించు పాడు రా
జుల కదనాన పాడయిన
శూరుల కాంతల మేల్మి నల్ల పూ
సల విషగాథ మే మెపుఁడు
సత్యముగా వినలేదు చుట్టు వా
ర్ధులు గల దీవియాటను న
రుల్ సొరనేరని కారణంబునన్. 17

ఉ. ఇంచుక దాపునందు గల
దీశ్వరు కోవెల సజ్జనాళి పూ
జించుచు మంచి కానికలఁ
జేర్చి నుతించెద రట్టి వెవ్వి లే

వంచును సంశయంబు వల
దయ్యె భజింపను గొండమల్లె లిం
చించుక గాంచఁగాఁ గలవ
యెక్కడఁ జూచిన నక్కడేసుమీ. 18

ఉ. ఆ కనుపించు పర్వతపు
టద్దతి హారిదిని యొందుబాఱు న
స్తోక తరంగ డోలికలఁ
దూఁగుచు హంస వధూవరుల్ సదా
కోకనదంపు వాసనల
కుక్ భ్రమియించు తదీయభాగ్యముక్
దాకొని చూడుమా కడు ము
దం బిడు నాత్మకు మిత్రబుద్ధితో. 19

ఉ. ఆ నది దేశమంతటను
నార్చుచు బారును, భూమియందుఁ గ
ళ్యాణమయంబు, శోభసపు
టారతు లిచ్చి డిగీశ బృంద మెం
తో నుతియించు చుందురు, బ్రి
తున్నము లెట్టివో గానరాక త్రే
మాన ధరాతలేంద్రుఁ డస
మానుఁ డటందురు నిత్యముం బ్రజల్. 20

చ. పరిమళయుక్తమై తనరు
బాలసమీరము లబ్బురాన భూ
ధరమునఁ బుట్టి జీవుల ను
దారగతిం దనివందఁజేసి, ని
ర్భర సుకుమార గాథ కవి
రాజులకుం దలియించు మర్మ మం
దరసితివా! విచారదశ
యంతము నొందు నిమేష మాత్రిలో. 21

మ. పొలపుంగల్గును రాత్రులందు గిరిపై
జ్యోతిర్లతా గుచ్ఛపు
న్వెలుగుంజూడ స్వదేశ యాత్రికులకుం
విభ్రాంతచేతస్కులై
యలపుంజెంది కృశించుచుం గొఱవిద
య్యా లట్లు భావింతు ర
న్యలు, తత్కాంతి విమర్శనీయము హితా
యోజింపు భీతిల్లకన్. 22

ఉ. అచ్చపు సొంపుపెంపున ది
నాంతము శాద్వలసీమలందు వేఁ
బచ్చిక మేసి మేసి, చెలు
వంబున జింకలు స్వేచ్ఛ యొప్పగా

నచ్చిక బుచ్చికం దిరుగు:
నత్తటి ముద్దుగఁ జెల్మిఁ జేయఁగా
నిచ్చ జనించు, జిక్క వవి
యెంతప్రియత్నముఁ జేసినన్ సఖా. 23

ఉ. పోవఁగఁబోవఁ ద్రోవ నొక
పూఁచిన దివ్య వనాన మ్రాఁకులుం
గోవెల లాది పక్షిగణ
కూజితముల్ జెలరేఁగుచుండు, సం
దేవి శకుంతరాజియొ? మ
త్తేవి లతాంతపు వింత సొంపులో
నీ వెలుఁగంగలేవు మహా
నీయ! ప్రహర్షము చెంగలింపఁగన్. 24

ఉ. ఆమడదూర ముండి రసఁ
గా వసదేవత ముమ్మరించి యెం
తో మురిపాన పాంథులను
దోడ్కొని స్వాగత మీయనో యనన్
గోమలవాయు డింభకుల
గుంపులు గుంపులఁ బంపుచుండు, గా
రామున వింతపూవుల ప
రాగము కానిక బెట్టు సొంపునన్. 25

ఉ. ఆ వన రామణీయకము
నారసినంతన భాగ్యదేవికిం

దావలమైన దేశమని
తప్పక దోఁచు సుమీ, విదేశ పాం
థావళి కద్దియే ప్రథమ
దర్శనచిహ్నము సంతసింప, నీ
కా విభవంపు దర్శనము
నందుట జన్మ తరించుటే సఖా! 26

చ. పొలముల కాపుబాలికలు
బొమ్మల గీముల నేర్పుటించి, సొ
మ్ముల గదియించి సేసలను
బోయుచుఁ బెండిలిఁ జేయుచుంద్రు బె
ద్దలగతి; యద్ది నీ వరసి
తాళి; యిదేమని ముచ్చటింపఁ, బ్ర
కృతుల నడయాడుచుందురు ప
కాపక నవ్వుచు లజ్జపెంపునన్. 27

మ. రమణీయంపు విచిత్ర వస్తుతతిఁ జే
ర న్వాంఛ గావించు నం
దు మనంబందున భ్రాంతిపుట్టి, మద నా
త్రోవ న్విలోకింతు వు
త్తమవాఃపూర విశాలదీర్ఘిక తరూ
ద్యచ్ఛాయలన్ నిల్చి సౌ
ఖ్యము నా మీఁదట గాంతు సింహపురి వ
ప్రాంతంబు నగ్రిద్యుతిన్. 28

మ. తులకించు న్నగరంబు నంతటను వి
ద్యుద్దీపముల్ వాడవా
డలఁ జెన్నారును రంగవేదికలు, వే
డ్కన్ మేళతాళాల పెం
పులు శ్రోత్రంబుల కింపుగాఁ బొడము బా
బూ! చంద్రకాంతోపలం
బుల సౌధాల విచిత్రదర్శనము సిం
హపురాప్తు కన్గోయికన్. 29

గీ. పంచమస్వరంబున వేశ్యభామలెల్ల
తీగరాగాలఁ దీయుచుఁ దిరుగుచుంద్రు
వలపు కిన్నెరసానులు వచ్చి వియ్య
మందెదరు తన్మహానంద మనుభవింప. 30

ఉ. సొమ్ముల నెమ్మెకత్తియలు
సొంపుగఁ బెట్టి బజారులందు సం
దమ్ముగ రాత్రులందున స
తమ్ము చరింతురు, చూచినంత క
న్దమ్ములు గోరగించి పయి
పంబడ చిత్తము భ్రాంతిఁగొల్పు, దే
శమ్ము పరిస్థితుల్ మది వి
చారణసేయుము నిబ్బరించుచున్. 31

చ. కులుకు మిటారి కత్తియలు
గొందఱు ని స్వలపింపఁజేయ సా

మ్మ్రులను ధరించి మన్మథుని
పూవుల వింటిని యెక్కు-వెట్టి చూ
పులశరజాల మేమఱక
పూనిక వేయుచు లేనిపోని భ్రాం
తుల గలిగింతురయ్యా యువి
దుఃఖము దెచ్చు నొకప్పుడుద్ధతిన్. 32

గీ. సింహనగర ముఖద్వార సీమయందు
సత్రశాల గలదు, నీవు జనెదు సరికిఁ
బ్రొద్దుగుంకును, నచ్చోట బోన మారగించి నిదురింపు మా యింటి పంచలందు. 33

గీ. పగటివేళను జొచ్చి యీ పట్టణంబుఁ
జూడవచ్చు నేఁ జెప్పిన చోద్యములను
తనివిఁ దీరంగ; రాజభవన విచిత్ర
ముల పసందు వర్ణింపగా నలవిగాదు. 34

గీ. అన్నపానాల కే మాత్ర మడ్డులేదు
నీవు యాచింపఁ బనిలేదు నిజము మిత్ర!
కోరుకొననిదే హెచ్చుగాఁ గూర్చువార
లెవ్వరైనను సందు లోకుందులేదు. 35

గీ. అడిగి కైకొంట నీచకార్యం బటంచు
దలఁచితివయేని కష్టించి ధనముఁగొను మ

దే మగసిరి యన్నిటికన్న, నెప్పుడైన
నరుగగా వచ్చు నీ దేశ మడ్డులేక. 36

గీ. ముక్కు దోమల యోధులు ముమ్మరించి
నిదుర దేవి రాజ్యంబుపై నివ్వటిల్లి
సిలుగు గూర్తురు ముక్కు బాకుల నిగిడ్చి
గాలిపగతుని కంటికిఁ గానరాక. 37

గీ. మఱచితి క్షమించు మహ్మాజి మర్మమొండు
వేఱుభాషను మాటాడు విధము గలదు
నీకు రాదది; కొన్నాళ్లు నేర్చికొమ్ము
కష్టముల దేవి యొకనినే కౌఁగిలించు. 38

గీ. మంచి సెబ్బర లన్ని క్రమంబుగాఁగ
వర్తక శిఖామణికిఁ దెల్పి బాటసారి
పోయివచ్చెద ననిచెప్పి పోయె నెటకొ ?
యతఁడు మనుజుఁడో ? దైవంబొ ? యెఱుఁగరాదు. 39

ఉ. తూరుపు తెల్లనయ్యె, దరి
దోఁచక దేవునిఁ బూజసేసి క
న్నీరుల మున్గి తేలి పయ
నింపఁ గడంగెను సెట్టి యొంటిగా
దారుల కేకరింపక ని
దానముతోడను, బొంగివచ్చు నీ
హారము దప్పు కొంచు పథి
కాగ్రణి చెప్పిన గుర్తుచొప్పునన్. 40

మ. కల చోద్యంబులఁ గాంచె నారయుచు మా
ర్గంబు న్విలోకించుచు చా
వల దుఃఖం బొక యింతవీడి, హరిపై
భారంబునుం బెట్టి లో
యల సత్త్వంబుల ఘీంకృతు ల్వినుచు ధై
ర్యంబంది యేకాకియై
యలఁతన్ సింహాపురంబుఁ జేరఁ జనె సా
యంసంధ్యాకాలంబునన్. 41

ఉ. అంతట వర్తకుండు పుర
మంతయుఁ ద్రిమ్మరి బాటసారి బ
ల్వింతగఁ జెప్ప చిత్రముల
వేడుకగాఁ గనుగొంగ నా పురం
బంతయుఁ జూచి, యెక్కుడగు
హర్మ్య సుధాంబుధి నోలలాడి సా
యంతనమందు నొక్క నిల
యంబును జేరెను విశ్రమింపఁగన్. 42

గీ. నాఁటిరాతిరి యా యింటి నాయకుండు
మురహరు చరిత్రము న్విని కరుణ వొడమ
నతిథి సత్కారముల నెల్ల నాచరించి
వింతగను విందుఁగూర్చె సుస్వాంతుఁ డగుచు. 43

చ. పిలిచినఁ బల్కనొల్లడు త
పించును గ్రొత్త మునీంద్రువోలె తాఁ

బిలిచినఁ బల్క రెవ్వరును
వేఱొక బాసను నుచ్చరించుటన్
గలఁతను జెంది భీతిఁగొని
కష్టదశం దలపోయుచున్ వెసన్
గలయ పురంబు నంతట వి
కారముతోఁ దిరుగాడు జోగినై. 44

మ. మఱియింకెట్టుల నా స్వదేశమును బ్రే
మం జూడ వీలౌనో ? నా
మురిపెంపుం గులకాంత సుందరముఖాం
భోజాత మేనాఁడు నేఁ
బరికింతున్ మును వైభవాల బడు లా
పాడించెఁ గష్టాలు, నా
చరితంబు న్వినువా రెవ్వ రకటా !
సంతాప చిత్తంబులన్. 45

గీ. ఇచట వారల బాస నే నెన్నఁడైన
వినియు నేర్చి యెఱుంగ; నెవ్వనికి నిచట
నా పలుకు దెలియ దకట! యీ పురంబు
నందు నన్ ద్రోయు విధిని నే మందు నింక. 46

గీ. మంటి చారలచే మేను మాసిపోయె
చినిఁగిపోయెను వస్త్రాలు; చేయి చాచి
యొరుల యాచింప నేర డోగిరము లేక
మురహారుఁడు పరుండె విచార పరవశుఁ డయి. 47

మ. అతఁడట్లానల చింతచే విసిగి కా
ర్యంబేదియుం దోఁచకన్
వెతలం జెందుచుఁ గొంత కాల మిటులో
వేసారి, తద్దేశపున్
గతులన్ వర్తకమర్మముం బ్రిబలకాం
క్షన్ గొన్ని తంత్రింబుల
ద్భుతరీతిన్ గ్రహియించి కూర్చె దివిణం
బున్ ధీరుఁడై యన్నిటన్. 48

మ. చిరకాలంబున కైన రాని కతముం
జింతించి చుట్టంబు లం
దఱు బేహారికి నుత్తర క్రియల స
ద్ధర్మాన చేయించి పో
యిరి; నిస్సీమవిచార వారినిధి నా
యిల్లాలునుం బుత్రుఁడున్
దరియుం దోవయుఁ దోఁచకుండి రట నిం
టం గష్టముల్ జెందుచున్. 49

గీ. వరదఁ బోయిన సెట్టి లాభమున వచ్చు
విధము; పందొమ్మిదేండ్లకు వింతఁదోఁప
వర్తకుండు స్వగ్రామంబు వలపుతోడఁ
జేరె, ధనరాశితోఁ దనవారిఁజూడ. 50



# చతుర్థాశ్వాసము



ఉ. తీరని దుఃఖపుంగడలిఁ
దేలుచు నాఁటిదినాన నెందుకో
చూరున దేవులాడ నల
శ్లోకపు గొట్టము గానుపింపఁగా
భారవి మున్నొకంట గుదు
వంగను బెట్టినద్దై సెలంగు సం
చారసి పత్రికఁ జేర్చి పతి
నాత్మఁ దలంచి పయుండె పుత్త్రికో. 1

గీ. ధనపు శకటంబులను పంచదరిని నిల్పి
మదన తాపానలంబున మ్రగ్గుచున్న
అంగనను జూడ సంతోష మతిశయిల్లి
అరిగె మురహారుఁ డింటికి బిరబిరాన. 2

గీ. గాఢనిద్రను జెందెడి కాంతతోడఁ
బవ్వళించిన పూరుషుఁ బొజచూచి
యెవ్వఁడో యని మదిలోన నెంచి, యూర!
సతుల చిత్తంబు లెంతయు చంచలములు.

గీ. అని తలంచుచు నుండెడి యంతలోన
సతి చివాలున లేచి మంచంబు డిగ్గి
నాఁడు పరదేశ మేఁగిన నాథుఁ డనుచు
గురుతుపట్టి యెగాదిగ పరికరించి. 4

ఉ. తీరని సంతసంబునను
దివ్వె వెలుంగు వెలుంగఁ జేసి, యిం
పారఁగఁ జూచియు స్న్రగని
యబ్బురపాటున గౌఁగిలించి కం
గారు మనంబుతో సతిని
కట్టెమటల్ నిలుచుండి యుబ్బి తా
భోరున నేడ్వ సాగె తన
పూర్వపు కష్టము లోడిగిల్లగన్. 5

గీ. నిదురమంపున మంచానఁ గదలుచున్న
తనయునిన్ లేపి నేఁటికి జనకుఁడెట్లొ
నచ్చె! లెమ్మురా! యని లేపఁ, బండ్లుఁ గొఱికి
దగ్గనను లేచెఁ గోపాగ్ని భగ్గు మనఁగ. 6

గీ. నాథుఁ డెక్కడికో పోయినాడటంచు
కలుషమతి వయి పుత్త్రునిఁ గాంచి, నాదు
పుత్త్రుఁడని చెప్పుచుంటి వపాత్రురాల
ధాత్రి మోహాంధకారిణుల్ తరుణు లరయ ? 7

గీ. "నగల నమ్ముటకై పోవునాఁటి కేను
గర్భవతినిగదా ! చిరకాల మగుట
మఱచితిరి యేమొకో!" యన, మగఁడు "నన్ను
వంచనముఁ జేయఁ గపటోక్తిఁ బలుకుచుంటి." 8

మ. అని రోషాగ్ని వెలార్చి నిష్ఠురపు వా
క్యంబుల్ బ్రసారించి కా
లుని చందంబునఁ జెంతనున్న యొక వా
లుం గేలఁ గైసేసి భా
ర్యను జంపంగఁ బ్రయత్నము న్సలిపి ప
ర్యంతస్థ మా లేఖనుం
గని యెవ్వాఁడో లిఖించె నంచు కడుకం
గారై విలోకింపఁగన్. 9

శ్లో. సహసా విదధీత న క్రియా
మవివేకః పర మాపదాం పదమ్
వృణుతేహి విమృశ్యకారిణం
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః. 10

ఉ. ఏ పని సాహసించి యొన
రింపఁగ రా దవివేక మెంతయో
యాపదఁగోరు, సంపదలు
యాచనచేయును సద్గుణంబులన్
గాపటికంబు హీనతకుఁ
గారణమా, పరికించి చక్కఁగా
లోపము దిద్దువారలకు
లోనగు సంపద లెల్ల భంగులన్. 11

చ. అని పఠియించి కోపమును
నాపి చివాలునఁ గత్తి నేలపై

నునుచుచుఁ గన్బొమల్ ముడిచి
యొప్పరికింపఁగ మిత్రుఁడా కవీం
ద్రుని రచనంబటం చెఱిఁగి,
తుందుదుకు న్విడనాడి భార్యనుం
దనయునిఁ జేరఁదీసికొని
తాను ముదంబుధి నోలలాడుచుఁన్. 12

ఉ. భారవి శ్లోకపు న్మహిమ
వల్లఁగదా! తలఁపన్ మదీయ సం
సారము దక్కఁ శాంతిఁగొనఁ
జాలి చరించుట; యద్దిలేనిచో
భూరివిచారవారినిధి
మున్గి నశించెడివాడనే, భళీ!
కారణజన్ములా బుధుల
గణ్యతరోక్తు లభీష్టదంబులా. 13

గీ॥ కుదువఁబెట్టిన శ్లోకంబు కొఱవగుటను
గావ్యముం బ్రకటింపక కవివరుండు
వర్తకునిరాకకై వేచి వర్తమాన
ములను గొనుచుండె రాయబారులను బంపి. 14

ఉ. ఎందరొ వచ్చి భారవి క
వీంద్రునితోడ మహానుభావ; నీ
వెందుల కింక గ్రంథమును
నేరికిఁజూపవు, వర్తకుండు ని

బ్బందిని బెట్టునప్పటికిఁ
బైకము జిక్కదెనాఁగ! తొంటి గో
ప్పందముఁజేసి తా విసఁడు
వారల బోధల నెన్నియేనియున్. 15

గీ. అంత బేహారి నిజపురి కరుగుదెంచు
వార్త విని శ్లోకమున కయి పైకముఁగొని
సంతసము పొంగిపొర్లంగ సత్కవి యొక
మంచిరోజుఁ బయనముఁ గావించుచుండె. 16

ఉ. భారవి సత్కవీంద్రు ఋణ
బంధనముం దెగత్రెంపి వానినిం
జారుతరంపు కాన్కలను
చక్కఁగఁ గొల్వకయున్న నెల్లరున్
దూరక పోవరంచును వ
ధూమణితోడను మూఁడువేల బం
గారపు నాణెముల్ గొనుచు
గ్రక్కున వర్తకుఁడుం బ్రయాణమై. 17

ఉ. దారిని బోవుచుండు నెడ
తజ్ఞుఁడు భారవి సత్కవీంద్రుఁ డా
దారినఁ గానుపింపఁగ ము
దంబున వర్తకుఁ డా కవీంద్రునిం

జేరి నమస్కరించి "కవి
శేఖరు శ్లోకముచే కుటుంబ మీ
తీరున నుంటయుం దెలిపి
దీవన లి"మ్మని కోరె భక్తితో. 18

మ. అనఘా! మా కడ ద్రవ్యముంట, భవదీ
యంబైన వాక్ఛక్తి నా
కను నా బోటికి నిల్చియుంగుట కగుం
గూర్కి న్ననుం గాంచి మీ
రనువౌ ప్రాపుగ తొల్లి గైకొను ఋణా
ర్థం బుంచు పత్రంబు మీ
ఘనతం దెల్పెడి శ్లోక మే సిడెదు కా
న్కల్ గొండు ప్రార్థించెదన్. 19

గీ॥ అనుచు ఋణపత్ర మిచ్చి కావ్యాంతరంబు
నందునం జేరు శ్లోకంబు వందనముల
మెచ్చి పసిడి నిష్కంబుల నిచ్చి దేవుఁ
బూజనేసిన గతిఁ గవిఁ బూజనేయ. 20

ఉ. ఆతఁడు ప్రేమవీధిని వి
హార మొనర్చుచు నుత్తమర్ణులై
రీతిగ నుండువారొకో? వ
రించెను నీదగు సద్గుణాళి నా
చేతముఁ గాన గైకొనుము
శీత మయూఖ దినేశు లుండు దా

కాతతమైన కీర్తిని
యన్వయ మిద్ధర పొంగి తేరఁగన్. 21

గీ. అంచు నాశీస్సు లిడిన కవ్యగ్రియాయుఁ
బల్లకని నెక్కఁ జేసి తా నుల్లమలర
స్వీయపురికిని గొనిపోయి శ్రేష్ఠబంధు
హితులు మెచ్చంగ నాతఁ డద్భుతపుభక్తి. 22

మ. పురి నూరేగఁగఁ జేసి, కానుకలిడి, ధీ
పూర్ణున్ గవీంద్రున్ బొరిం
బొరి తృప్తిం బొనరించి, వానివలనన్
బోధ్యంబులౌ వాని నే
ర్పరియై వించు జగజ్జనంబు పొగడన్
వర్ధిల్లె నే ప్రొద్దులున్
బురుఁ డవ్వారలు వీని కన్నడి సభో
భూభాగముల్ నిండఁగన్. 23

ఉ. బంధుర మల్లికా ప్రసవ
పంక్తిగళన్మకరంద బిందు ప
ప్పంధయ చక్రవర్తిగతి
భాసిలు సత్పద గుంభనంబులన్
గ్రంథము నల్లినా డతని
గాంచి తరించెద నంచు భోజుఁడా
నందముతోడ భారవిఁ గ
నం జనుదెంచెను పండితాళితోన్. 24

గీ. నీవు వ్రాసిన గ్రంథంబు నేర్పుఁజూపి
నన్ను కృతిపతిఁగాఁ జేసి నాదుయశము
నిఖిల దిగ్దేశ రాజన్య నికరములకుఁ
దెలియఁజేయుచు నాశీర్వదింపు మనఘ! 25

మ. అనినన్ భారవి సంతసించి కృతి ని
యుక్తుండగ్గ భూపాలుఁ డీ
యనఘుం డంచు దలంచి యియ్యకొనె, యు
ద్యార్యోత్తముల్ బాంధవుల్
దన పాండిత్యముఁ జూచి సంతసిల ని
త్యశ్రీలు వర్ధిల్లగాఁ
జనియెన్ భోజుని వెంట సద్భటులు ని
చ్ఛన్ దన్ను సేవింపఁగన్. 26

గీ. కవులు గాయకు లాదియౌ ఘనులు గొలువ
భోజ భూపాలుఁ డాస్థాన భూమియందు
రమ్య మణిరత్న మౌక్తిక రాంకవములు
బహుమతి నొసంగె భారవి పండితునకు. 27

సర్గము సంపూర్ణము.

